2164

# చైనా విప్లవము : మావో






రచయిత:

చెన్ పో-టా

అనువాదం:

డి. యస్. ప్రసాద్




[illegible]లాంధ్ర ప్రచురణాలయం

[illegible]జయవాడ

III

# రచయిత గురించి

చెన్ పో - టా చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ సభ్యుడు. పెకింగ్‌లోని మార్క్సిస్టు - లెనినిస్టు సంస్థ వుపాధ్యక్షుడు, శాస్త్రీయ అకాడమీకి వుపాధ్యక్షుడుకూడా. 1937 కు పూర్వం యీయన అభివృద్ధి నిరోధక కుమింటాంగ్ పాలనక్రిందనున్న ఉత్తరచైనాలో కమ్యూనిస్టుపార్టీ రహస్య కార్యకలాపాలను కొనసాగించారు. జపాన్ దురాక్రమణకు వ్యతిరేక ప్రతిఘటనా యుద్ధకాలమంతటా పార్టీ కేంద్రకమిటీలో పనిచేశారు. చైనానుగురించి ప్రత్యేక అధ్యయనం చేశారు. "చైనాలోని నాల్గు పెద్దకుటుంబాలు", "ఆధునిక చైనాలో భూమిపన్ను గురించి 'పరిశోధన"; 'యువాన్-షే-కాయి-ఒక మహాదురాక్రమణదారు'; 'చైనా ప్రజల ప్రబల శత్రువు చాంగ్-కై-షేక్'; అనునవి యీయన రచనల్లో కొన్ని.

ఈ పుస్తకం 1951 లో జరిగిన చైనా కమ్యూనిస్టుపార్టీ 30 వ వార్షికోత్సవ సందర్భంలో వ్రాయబడింది.

# మావో చైనాలోని మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంత వ్యాఖ్యాతలలో అగ్రగణ్యుడు

"ప్రజాతంత్ర ప్రజాస్వామిక నియంతృత్వము" అనే వ్యాసంలో మావో సే-టుంగ్ యిలా వ్రాశారు:

"అక్టోబరు విప్లవఘోషలు మమ్ములను మార్క్సిజం-లెనినిజం వైపుకు ఆకర్షించాయి. అక్టోబర్ విప్లవం, ఒకదేశం యొక్క భవిష్యత్తును గురించి అంచనా వేయుటలోనూ, ఆదేశపు సమస్యలను పునరాలోచించుటలోనూ, యావత్ప్రపంచమునందునూ, చైనాయందునూగల అభ్యుదయ భావములు గలవారు కార్మికవర్గ అంతర్జాతీయ దృక్పథమును అనుసరించునట్లు సహాయంచేసింది. రష్యన్ ప్రజల మార్గాన్ని అనుసరించండని పిలుపిచ్చింది."

చైనాలో యిట్టి అభ్యుదయకాముకుల అత్యుత్తమ ప్రతినిధి కామ్రేడ్ మావోతప్ప వేరెవ్వరూగాదని అందరికీ తెలిసినదే. మార్క్సిజం - లెనినిజంయొక్క సజీవ సత్యమును చైనావిప్లవముయొక్క ఆచరణతో సక్రమముగా మిళితం చేయుటయే కామ్రేడ్ మావో చైనావిప్లవానికి చేసిన మహత్తరసేవ. తద్వారా చైనావిప్లవములోని సమస్య లనేకములు

పరిష్కృతమైనాయి. చైనాలోని భౌతికపరిస్థితులకూ, ప్రాచ్య దేశాల పరిస్థితులకు అనుగుణ్యంగా మార్క్సిస్టు - లెనినిస్టు శాస్త్రమును మరింతగా అభివృద్ధిచేశాడు. ఆ చుక్కానితో చైనా ప్రజావిప్లవమును అంతిమవిజయంవైపుకు విజయవంతంగా నడిపాడు.

మావో యిలా అంటున్నాడు:

"మార్క్సు, ఏంగిల్సు, లెనిన్, స్టాలిన్‌ల సిద్ధాంతము విశ్వజనీన సత్యము."

అయినా ఆ మహోపాధ్యాయుల సిద్ధాంతమును చైనాకన్వయించుట, దాన్ని ప్రజలయొక్క అజేయమైన శక్తిగా రూపొందించుట, సిద్ధాంత పోరాటములను సాగించుటకై నిరంతరమూ కృషిచేయుట అవుసరం. కామ్రేడ్ మావో 30 ఏండ్లు, పార్టీ వెలుపలనున్న అభివృద్ధినిరోధక సిద్ధాంతములకు, పార్టీలోపలనే వివిధరూపములలో ప్రవేశించిన అవకాశవాదములకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటము నిరంతరం కొనసాగించాడు. జాతీయవాదులకు వ్యతిరేకంగాను, కుమింగ్‌టాంగ్‌లోనున్న మితవాదులు, రాజీవాదులకు వ్యతిరేకంగాను ఛెన్‌టూషీయిజమ్, ట్రాట్స్కీయిజములకు వ్యతిరేకంగాను, అనేక సందర్భాలలో పార్టీలో తలెత్తిన "అతివాద" దుందుడుకుతనమూ, ఛెన్‌టూషీయిజమును పునరుద్ధరించు ప్రయత్నములకు వ్యతిరేకంగాను జరిపిన పోరాటాలే దీనికి నిదర్శనాలు. మార్క్సు, ఏంగిల్సు, లెనిన్, స్టాలిన్‌ల విప్లవసిద్ధాంతములను ఆకళింపుచేసుకొనుటలోనూ వాటిని చైనాకన్వయించుటలోనూ, అసమానుడని కామ్రేడ్ మావో నిరూపించు

కున్నాడు. ఆయన నడిపించిన పోరాటాలు చైనా కమ్యూనిస్టు పార్టీని సంఘటిత పర్చుటకు వుపకరించాయి.

సిద్ధాంతము ఆచరణల సమైక్యతయే మార్క్సిజం - లెనినిజములయొక్క విశిష్టత. మహోపాధ్యాయులగు మార్క్స్, ఏంగిల్సు, లెనిన్, స్టాలిన్‌ల అడుగుజాడల పయనిస్తూ, మావో కూడా విప్లవ చైనాలోని విప్లవప్రజానీకపు సృజనాత్మక శక్తి పట్ల అత్యంతశ్రద్ధ చూపాడు. కామ్రేడ్ మావో ఏనాడూ, తన మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతకృషిని ప్రజానీకంయొక్క విప్లవోద్యమంనుండి వేరు చేయలేదు. సర్వకాల సర్వావస్థల యందునూ ఆయన మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతమును చైనావిప్లవముయొక్క ఆచరణతో జోడించాడు. మార్క్సిస్టు మూలసూత్రమును - వర్గీకరణ చేయు పద్ధతిని - చైనా విప్లవానుభవాన్ని అధ్యయనంచేసి, ఆకళింపు చేసుకొనుటకై వినియోగించాలని కామ్రేడ్ మావో తరుచు చెప్తుంటాడు. అట్లుచేయుటద్వారా మార్క్సిజం - లెనినిజం యొక్క విశిష్టతను మరొక పర్యాయం నిరూపించాడు. దానియొక్క అనంతమైన, సజీవమగు విప్లవశక్తి మరింత రుజువైంది.

చైనాయొక్క విప్లవప్రజాబాహుళ్యపు సృజనాత్మక శక్తిపై ఆధారపడుటద్వారానే, చైనా విప్లవపు బహుముఖ విస్తృతానుభవంపై ఆధారపడుటద్వారానే కామ్రేడ్ మావో మార్క్సిజం - లెనినిజములను అభివృద్ధిపర్చాడు. మార్క్సిజం - లెనినిజమునకు వక్రభాష్యం చెప్పుట, ప్రజలముందు దాన్ని కించపర్చుటకై వుద్దేశింపబడిన తుక్కురకం వాదనలన్నింటిని బట్టబయలు చేయుటద్వారానే, యీ అభివృద్ధి జరిగింది.

1922 లో లెనిన్ వ్రాసిన "సజీవ (Militant) భౌతిక వాదం యొక్క ప్రాముఖ్యత" అన్న ప్రఖ్యాతవ్యాసంలో ఆయన యిలా అన్నాడు:

"మార్క్సు తన గతితార్కిక సూత్రాలను వివిధ సమస్యలకు జయప్రదంగా అన్వయించాడు. తూర్పుదేశాలలో (జపాన్, ఇండియా, చైనా) ప్రతిరోజూ నూతనవర్గాలు, పోరాటంలోకీ, సృజనాత్మక కృషిలోకీ ముందుకొస్తున్నాయి. అనగా, ప్రపంచజనాభాలో అత్యధికసంఖ్యాకులైన కోట్లాది ప్రజానీకం ముందుకొస్తున్నదన్నమాట. ఇంతవరకు 'నిస్తబ్ధత' లోనూ, జడప్రాయంగానూ వుండుటవల్ల అభివృద్ధిచెందిన యూరప్‌దేశాలలో సైతం క్షీణతా, పెరుగుదల లేకపోవడం సంభవించాయి. అట్టి యీ నూత్నప్రజానీకంయొక్క, నూత్న వర్గాలయొక్క జాగృతి, పురోగమనమూ ప్రతిరోజూ మార్క్సిస్టు సిద్ధాంతాన్ని దృఢతరం చేస్తున్నది."

చైనా కార్మికవర్గ నాయకత్వాన చైనా ప్రజానీకం పోరాటాలలోకి సమీకృతమై మహత్తరమగు విజయాలను సాధించుటయను వాస్తవిక విషయమే, ప్రాచ్యదేశాలలో మార్క్సిజంయొక్క విశిష్టతకు మరియొక్క క్రొత్త నిదర్శనం. మార్క్సు, ఎంగెల్సు, లెనిన్, స్టాలిన్‌ల బోధనలు సర్వశక్తి సంపన్నమగు శాస్త్రమనీ, ఎట్టి మినహాయింపులూ లేకుండా సకలప్రదేశములకూ అన్వయించ వీలున్నదనీ యిది నిరూపిస్తున్నది. చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకుడు కామ్రేడ్ మావో, యీ శాస్త్రమును చైనా పరిస్థితుల కన్వయించి విజయవంతంగా దాన్ని అభివృద్ధిపర్చాడని నిరూపిస్తున్నది.

# ప్రాచ్యదేశాలలోని అశేష వైరుధ్యాలకు చైనా నిలయం

గత వందసంవత్సరాలుగా, ముఖ్యంగా 19 వ శతాబ్దానంతరం ప్రాచ్యములోని వైరుధ్యాలకు చైనా కేంద్రస్థానంగా వుంటూ వచ్చింది.

మొదటిది :—చైనా సామ్రాజ్యవాదుల వలసదేశంగా నుండుట. ప్రపంచంలోని సామ్రాజ్యవాదులంతా చైనాలో కాలూనినారు. అత్యంతవిశాలమగు, అత్యంత భాగ్యవంతమైన దేశంగా చైనాను వారు పరిగణించారు.

"సామ్రాజ్యవాదం - పెట్టుబడిదారీ విధానపు అవసాన దశ" అనే పుస్తకంలో 1916 లో లెనిన్ యిలావ్రాశాడు :

"చైనాన్ను పెట్టుబడిదారీవిధానపు కాలంలో మిగతా ప్రపంచమంతా ఎవరికిదొరికింది వారు ఆక్రమించుకున్న వెనుక, యీ అర్ధ, అధీనదేశాలకై తగవులు తీవ్రంగావడం సహజం. చైనాను పంచుకోవడం యిప్పుడే ప్రారంభమౌతున్నది. ఈ సందర్భంలోనే జపాన్, అమెరికాల మధ్య పోరాటం తీవ్రతరమౌతున్నది."

1927 లో స్టాలిన్ యిలా వ్రాశాడు :

"కొన్నికోట్ల జనాభాతో నున్న చైనాదేశము, విదేశీయులైన సరుకులను, పెట్టుబడులనూ ఎగుమతి చేయడానికి అత్యంత ప్రధానమైన మార్కెట్‌గా వుంది."

"...సామ్రాజ్యవాదము చైనాను విచ్ఛిన్నం చేస్తుంది. తమ వెనుకటిస్థావరాలను పూర్తిగాగాని, పాక్షికంగాగాని కాపాడుకొనుటకై చైనాను ముక్కచెక్కలు చేసి మొత్తం రాష్ట్రాలనే గుంజుకొనవచ్చు."

తమ దోపిడి సాగించుటకు చైనా అనుకూలంగా వుంటుందని సామ్రాజ్యవాదులు ఊహించారు గనుకనే వారు అనేక సందర్భాలలో చైనా విప్లవమును ప్రతిఘటించుటకు ఐక్యంగా నిలబడ్డారు. ఉదా॥ 1900 సం॥లో 8 సామ్రాజ్య వాదదేశాల సైన్యాలు పెకింగ్‌పై దాడిచేసి దేశభక్తులైన ప్రజానీకమును పూచకోత కోశారు. దీనినే ఐహూటువాన్ అంటారు. (విదేశాల్లో బాక్సర్సు తిరుగుబాటు అని పిలుస్తారు. అనువాదకుడు) 1927 లో సామ్రాజ్యవాదులు చైనా మహా విప్లవమును ఒక్కటై వ్యతిరేకించారు. ఈ సందర్భాలలో చైనాను అంతాకలిసియే పంచుకున్నారు. అయితే యెవరికి వారు చైనాను తామే హస్తగతం చేసుకోవాలని సామ్రాజ్య వాదులు ఆశించడంతో వారి మధ్య వైరుధ్యాలు తీవ్రతర మైనవి. తద్వారా కామ్రేడ్ మావో చెప్పినట్లు "చైనాలో సామ్రాజ్యవాదుల మధ్య వైరుధ్యాలుద్భవించాయి."

అంటే చైనాలో వలసలుసంపాదించుకొనుటలో జరిగిన పోరాటంలోని వైరుధ్యాల ఫలితంగా, చైనాలో వారి సంఘటన ఐక్యంగా నుండుటకు బదులుగా తరుచు చీలికలై పోయింది.

రెండవది :—సామ్రాజ్యవాదులలోని వైరుధ్యాలవల్ల చైనా పాలకవర్గంలోని భూస్వామ్య, రాజీవర్గాలలో వైరుధ్యాలు తీవ్రతరమై యుద్ధప్రభువులమధ్య ఎడతెగని యుద్ధాలకు దారితీశాయి.

1928 లో కామ్రేడ్ మావో యిలా అన్నాడు:

"రిపబ్లిక్ అవతరించిన మొదటి సంవత్సరంనుండి, సామ్రాజ్యవాదం, దేశంలోని రాజీవర్గము, భూస్వాముల ప్రోత్సాహంతో, పాత క్రొత్త యుద్ధ ప్రభువులలోని వివిధ ముఠాలమధ్య నిరంతర యుద్ధాలు జరిగాయి. అర్ధవలస చైనా యొక్క ప్రత్యేకలక్షణాల్లో యిది యొకటి...

"ఇది జరుగడానికి రెండు కారణాలున్నాయి. కేంద్రీకృత పెట్టుబడిదారీ ఆర్థికవిధానమునకు బదులు వికేంద్రీకృత వ్యవసాయార్థిక విధానమున్నది. సామ్రాజ్యవాదులు ఎవరికి చిక్కింది వారు హద్దులు పెట్టుకొని దేశాన్ని చీల్చి దోపిడిచేశారు."

అందువల్ల చైనాలోని భూస్వామ్యవర్గాలు, రాజీ వర్గాలు, వేరువేరు సామ్రాజ్యవాదులక్రింద పనిచేశారు. వివిధ స్థానిక భూస్వామ్య శక్తులకు ప్రాతినిధ్యం వహించారు. తత్ఫలితంగా యీ పాలకవర్గశక్తులు కూడా ఐక్యమైలేక చీలిపోయి వున్నాయి.

ఇక మూడవది:— సామ్రాజ్యవాద, భూస్వామ్య శక్తుల జంటదోపిడికి గురైన చైనాప్రజలు తీవ్రమైన వెతల పాల్పడ్డారు. 1840 నల్లమందు యుద్ధం జరిగిన నాటినుండి చైనా ప్రజానీకం సామ్రాజ్యవాద, భూస్వామ్యవర్గాలకు వ్యతిరేకంగా ఎడతెగని పోరాటం కొనసాగిస్తూనే వచ్చింది. మధ్య మధ్య విరామాలున్నా అవి స్వల్పకాలవ్యవధులు మాత్రమే. అసంఖ్యాక ప్రజానీకం గలిగిన సువిశాలమైన దేశం గావడంవల్ల ప్రతిపోరాటంలోనూ అశేషజనసామాన్యం సమీకృతులైనారు.

చైనా ప్రజానీకం తమ దేశాన్ని ఆక్రమించిన ప్రతి సామ్రాజ్యవాదంపైనా పోరాటం సాగించారు. ఏ ఒక్క

విప్లవ ప్రతీఘాతుక పాలనకూ చైనా ప్రజానీకం తలవొగ్గలేదు. చైనాదేశం దీర్ఘకాల విప్లవంలో చిక్కుకున్నది.

అంటే, చైనాప్రజలకూ, సామ్రాజ్యవాదులు, భూస్వామ్య వర్గాలకూ మధ్యనున్న వైరుధ్యాలకు రాజీలేదు. సామ్రాజ్యవాదం, భూస్వామ్య విధానాలకు ప్రతికూలంగా సాగించిన పోరాటంలో చైనా ప్రజానీకం, అత్యంత శక్తివంత మైన ఐక్యశక్తిగా రూపొందింది.

ఈవిధంగా ప్రాచ్యదేశాలలోగల వైరుధ్యము లన్నింటికీ చైనా కేంద్రస్థానమైంది. స్థూలంగా చెప్పాలంటే సామ్రాజ్య వాదుల మధ్యగల తీవ్రపోరాటాలకు, విప్లవశక్తులు, విప్లవ ప్రతీఘాతుక శక్తులకు మధ్యనున్న తీవ్రపోరాటాలకూ చైనా నిలయమైంది.

చైనా ప్రజావిప్లవ విజయమొక్కటే యీ వైరుధ్యా లను పరిష్కరించి, ప్రాచ్యదేశాలలో సామ్రాజ్యవాద సంకె ళ్ళను త్రెంచగలదు. ఈ విజయమును సాధించుట కవుసరమైన శక్తి చైనాప్రజలకున్నది. అయితే యీ విజయమును వాస్త వముగా సాధించుట కవసరమగు రీతుల్లో, చైనా ప్రజలశక్తిని సంఘటితపర్చుట ఒక్క కార్మికవర్గ నాయకత్వమున మాత్రమే సాధ్యమగును.

చైనా కార్మికవర్గం అత్యంతవిప్లవ తత్వమును ప్రద ర్శించుటకు ప్రధానంగా మూడుకారణాలున్నాయి: (1) చైనా కార్మికవర్గం విదేశీసామ్రాజ్యవాదులు, స్వదేశీయ భూస్వామ్య పెట్టుబడిదారీ వర్గాలచే క్రూరంగా దోపిడికి గురిచేయబడింది. (2) చైనాకార్మికవర్గం మిక్కిలి కేంద్రీకృతమైంది. Concentrated చైనా పరిశ్రమలు అత్యల్పంగానే అభివృద్ధి యైనప్పటికీ,

వున్నవి నాల్గూ కేంద్రీకృతమైయున్నాయి. 500 పైగా కార్మికులను పెట్టుకున్న పారిశ్రామిక సంస్థలలోనున్న కార్మికుల మొత్తంసంఖ్య చాలఅధికంగావుంది. (3) మొత్తం జనాభాతో పోల్చినపుడు కార్మికవర్గపు సంఖ్య తక్కువే అయినా, వివిధ రకాలుగా కార్మికులుగా అర్థ కార్మికులుగానున్న వారిసంఖ్య అధికంగా నున్నది. గ్రామసీమల్లోని అర్థకార్మికులను (బీద రైతాంగము)కూడా కలిపి చూచినట్లయితే కార్మికులూ, అర్థ శ్రామికులూచేరి జనాభాలో సగంకంటె చాలఎక్కువే వుంటారు. వీరు అమానుషమైన పీడనను గురియౌతున్నారు. ఈ కారణాలన్నింటివల్లనూ చైనా కార్మికవర్గము శక్తివంత మైన పోరాట శక్తిగా నున్నది. తమ స్వంత రాజకీయ పార్టీ యగు కమ్యూనిస్టుపార్టీని నిర్మించుకున్నది. చైనాలోని విప్లవ వర్గాలన్నింటికీ నాయకుడుగా తయారైంది.

ఇంతగా సంఘటితమైన యీ కార్మికవర్గము, దీర్ఘకాల విప్లవంలో నిమగ్నమైయున్న చైనాలోని అశేష విప్లవరైతాంగముయొక్క, విప్లవశక్తులన్నింటియొక్క నాయకుడుగా తయారైంది. రష్యాలో సోషలిస్టు విప్లవం విజయమొందిన కార్మిక వర్గ విప్లవయుగంలో నున్నందువల్ల చైనావిప్లవమునకు అమూల్యమైన అంతర్జాతీయ సహాయం లభించింది. చైనా ప్రజా విప్లవవిజయం, సామ్రాజ్యవాదమూ దానితొత్తులగు భూస్వామ్య, రాజీవర్గాలపై చైనాప్రజలు సాధించిన విజయం అనివార్యమని యీ విషయాలన్నీ తెలియజేస్తాయి.

1927 లో స్టాలిన్ యిలా అన్నాడు:

"చైనాలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటము ప్రజాపునాదిగల్గినదిగా, జాతీయ స్వభావముగల్గినదిగా వుండాలి.

అది నెమ్మదినెమ్మదిగా అభివృద్ధియై, సామ్రాజ్యవాదంతో తాడోపేడో తేల్చుకునే పోరాటంగా రూపొంది, ప్రపంచ మంతటా సామ్రాజ్యవాదంయొక్క పునాదులనే వూపివేయ గల పోరాటంగా పరిణామం చెందాలి."

చైనాలో వాస్తవంగా యిదే జరిగింది.

వివిధ సామ్రాజ్యవాద దేశాలమధ్య తగాదాలకు కారణమై, భూస్వామ్యవిధానం చాలకాలంగా వుంటూ వచ్చిన విశాలమగు చైనావంటి దేశంలో విప్లవం తేలికగా విజయవంత మౌతుందనుకోరాదు. విప్లవం సులభసాధ్యంగాదు. కామ్రేడ్ మావో 1949 లో వ్రాసిన వ్యాసంలో, విప్లవం విజయవంత మగు క్రమమును యీ క్రింది విధంగా వివరించాడు.

"పోరాటం జరిగింది, వోడిపోయింది. తిరిగి పోరాటం జరిగింది. తిరిగీ వోడిపోయింది. ఇప్పుడు సాధించిన ప్రధాన విజయం వచ్చేవరకు 109 సంవత్సరాలకాలం, వందలాది సైనిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రక్తప్లావిత, రక్తరహిత చిన్నా పెద్దా పోరాటాలు సాగించడంద్వారా చేకూరిన అనుభవం వుంది."

అంటే, చైనావిప్లవం, మిక్కిలి క్రూరమైన, చిక్కులతో గూడిన, క్రమమన్నమాట. ఇందువల్లనే, చైనా కార్మిక వర్గమూ, చైనాప్రజానీకమూ కాకలుదీరారు. చైనాకార్మికవర్గ పార్టీయగు కమ్యూనిస్టుపార్టీ సంపూర్తిగా ఆరితేరింది. విప్లవం యొక్క, అమూల్యమైన అనుభవమంతా చైనా కార్మికవర్గం యొక్క, చైనాప్రజానీకంయొక్క సొత్తు. ఇట్టి అమూల్యమైన విప్లవానుభవం మార్క్సిజం - లెనినిజంను మరింత భాసమాన మొనర్చింది.

కామ్రేడ్ మావోయొక్క రచనలు, చైనావిప్లవంపై ఆయన చేసిన సిద్ధాంతీకరణలు, చైనా విప్లవ అమూల్యానుభవంయొక్క నిగ్గుదేలిన సత్యములే.

1919 నవంబరులో కామ్రేడ్ లెనిన్ ప్రాచ్యదేశాల కమ్యూనిస్టుల కిలా చెప్పారు:

"ప్రపంచములోని కమ్యూనిస్టు లెవ్వరూ ఎదుర్కొనని సమస్యను మీరు ఎదుర్కొంటున్నారు. మీరు, కమ్యూనిస్టు సిద్ధాంతము, ఆచరణలపై ఆధారపడి యూరప్ దేశములలో లేని ప్రత్యేకపరిస్థితులకు అలవాటుపడి, యీ సిద్ధాంతమును, ఆచరణను మీరు అన్వయించుకోవలసి వుంటుంది. మీరు పని చేస్తున్నచోట ప్రజానీకంలో అత్యధికులు రైతులు. ఆ పరిస్థితుల్లో మీరు మీకర్తవ్యమును, పెట్టుబడిదార్లకు వ్యతిరేక పోరాటంద్వారాగాక, మధ్యయుగీన అవశేషాలకు వ్యతిరేకంగా పోరాడుటద్వారా, నెరవేర్చవలసి వుంటుంది."

లెనిన్ యింకా యిలా అన్నాడు :

"యావత్ప్రపంచమందూగలపురోగామి కార్మికవర్గంతో, తరుచు మధ్యయుగీన పరిస్థితులలో జీవిస్తున్న ప్రాచ్యదేశాల కార్మికవర్గమూ, పీడిత ప్రజానీకములకు గల మిత్రత్వం యొక్క ప్రత్యేక లక్షణములను మీరు గ్రహించవలసి వుంటుంది."

లెనిన్ యింకోపర్యాయం యిలా అన్నాడు :

"శ్రామికజనబాహుళ్యము యొక్క విప్లవ కార్యకలాపములను స్వతంత్ర కార్యాచరణ, నిర్మాణములవైపుకు సమీకరించాలి. అభివృద్ధిమైన దేశాల కమ్యూనిస్టుల కుద్దేశించబడిన

కమ్యూనిస్టు బోధనలను ప్రతిదేశ ప్రజానీకమునకు అర్థమగునట్లు చేయాలి. సత్వరం సాధించవలసిన కర్తవ్యములను సాధించాలి. యితరదేశాల కార్మికవర్గంతో వుమ్మడి పోరాటంలో చేయిగల్పుట మొదలగునవి కర్తవ్యాలుగా వుంటాయి.

"ఈ కర్తవ్యాలకు పరిష్కారమార్గం మీకు ఏ కమ్యూనిస్టు గ్రంథములోనూ లభ్యంగాదు. రష్యాలో కొనసాగించబడిన సంయుక్తపోరాటంలోనే దీనికి పరిష్కారమార్గం దొరుకుతుంది. మీ స్వతంత్ర అనుభవం యొక్క ప్రాతిపదికపైననే యీ కర్తవ్య నిర్వహణకు పూనుకోవాలి."

పైన లెనిన్ సూచించిన కర్తవ్యము యొక్క మూల సూత్రములను లెనిన్, స్టాలిన్‌లు తమ రచనలద్వారా పరిష్కరించారనేది అందరికీ తెలిసిందే. చైనా సమస్యపై కామ్రేడ్ స్టాలిన్ అమూల్యమైన సిద్ధాంతరచన చేశారు.

లెనిన్, స్టాలిన్‌లయొక్క కృషిని కొనసాగించుట,నిరంతరం చైనా అనుభవమును అధ్యయనం చేయుట; కమ్యూనిస్టు మూలసిద్ధాంతములు, ఆచరణను చైనా విప్లవపు ఆచరణతో సమ్మిళితం చేయుట, అభివృద్ధియైన దేశాల కమ్యూనిస్టు బోధనలను చైనాప్రజానీకమునకు అర్థమగునట్లు చేయుట, చైనా పరిస్థితులను దృష్టిలోపెట్టుకొని యీ బోధనలకు మరింత వన్నె చేకూర్చుట, వాటిని చైనావిప్లవపు సిద్ధాంతము, ఆచరణలుగా రూపొందించుట, ప్రపంచవ్యాపితంగా సామ్రాజ్యవాదమునకు వ్యతిరేకంగా సాగుతున్న సాధారణ పోరాటంలో చేతులుకల్పునట్లు కోట్లాది ప్రజానీకమును వుత్సాహపర్చుట, సోషలిస్టు సోవియట్ యూనియన్‌తో మిత్రత్వము నెరపునట్లు, కార్మికవర్గముతో వివిధదేశాలలోని అభ్యుదయ కాముకశక్తు

లతో యావత్ప్రపంచమందలి పీడితజాతులతో ఐక్యముగునట్లు పుత్సాహపర్చుట అనునవి చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకుడైన కామ్రేడ్ మావో కర్తవ్యాలుగావున్నాయి. ఈ కర్తవ్యాలు నిర్వహించబడినవి. తత్ఫలితంగా, మహాచైనా భూభాగంపై సామ్రాజ్యవాదుల, వారి తొత్తులయొక్క పాలన కూలద్రోయబడింది.

## చైనావిప్లవం ప్రపంచ విప్లవంలో భాగమే

పీడితజాతులు సాగిస్తున్న విముక్తి వుద్యమాలను, ప్రపంచ కార్మికవర్గ సోషలిస్టు విప్లవంలో భాగంగానే, లెనిన్ స్టాలిన్ సిద్ధాంతం పరిగణిస్తుంది.

లెనిన్-స్టాలిన్‌ల యీ విప్లవసిద్ధాంతానికి అనుగుణ్యంగానే కామ్రేడ్ మావో కూడా, చైనావిప్లవమును వేరైపోయిన సమస్యగా యెన్నడూ పరిగణించలేదు. దానిని ప్రపంచ కార్మికవర్గ విప్లవపుకాంతిలోనే, సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవపు వెలుగులోనే చూచుట జరిగింది.

మన యుగం సామ్రాజ్యవాదము, కార్మికవర్గ విప్లవముల యుగం గావడం, సోషలిజం సోవియట్‌యూనియన్‌లో ప్రథమ విజయం సాధించినయుగం, మార్క్సిజం యొక్క నూత్నయుగం, అంటే లెనినిజంయొక్క యుగం గావడంవల్లనే చైనావిప్లవం, ప్రధానంగా సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవంగా వుంది.

1926 మార్చిలో కామ్రేడ్ మావో, అప్పుడు కొమింటాంగ్‌లోనున్న టాయ్‌ఛి-టావోయిజమ్‌ను ఖండిస్తూ వ్రాసిన

"చైనా సమాజమునందలి వర్గముల పరిశీలన" అనే వ్యాసంలో ప్రపంచం రెండు పెద్ద శిబిరాలుగా చీలిపోవడంవల్ల ఏర్పడిన పరిస్థితిని యిలా వర్ణించారు :

"ఇప్పుడు ప్రపంచంలో ఏర్పడిన, విప్లవం, విప్లవ ప్రతీఘాతుకం అనే రెండు శక్తులూ, అంతిమ పోరాటంలో నిమగ్నమైవున్నాయి. ఈ రెండు మహాశక్తులూ రెండు పెద్ద నినాదముల నిస్తున్నవి : దీనిలో ఒకటి. మూడవ ఇంటర్నేషనల్ లేవదీసిన విప్లవ నినాదం. దీనిక్రిందనే, ప్రపంచమందలి పీడితవర్గాలన్నీ సమీకృతమైనాయి; పోతే రెండవది. నానా జాతి సమితి లేవదీసిన విప్లవ ప్రతీఘాతుక నినాదం. దీనిక్రింద ప్రపంచమందలి విప్లవ వ్యతిరేకశక్తులు సమీకృతమైనాయి. అయితే మధ్యస్థంలోనున్నవర్గం త్వరగానే రెండుగాచీలి, కొన్ని శక్తులు అతివాదంవైపుకు మొగ్గి త్వరితగతిని విప్లవశక్తులలో చేరతాయి, మరికొన్ని శక్తులు మితవాదంవైపు మరలి విప్లవ ప్రతీఘాతుక శక్తుల్లో చేరిపోతాయి. "స్వతంత్రం"గా వుండడానికి వారికెట్టి అవకాశమూ లేదు."

కామ్రేడ్ మావో యొక్క వుద్దేశ మేమిటో సుస్పష్టమే. అక్టోబరు సోషలిస్టు విప్లవానంతరం విశ్వవ్యాప్త కార్మికవర్గ సోషలిస్టు విప్లవోద్యమ నాయకత్వాన వున్న సామ్రాజ్యవాద వ్యతిరేక శిబిరమూ, సకల విప్లవ ప్రతీఘాతుకశక్తులతో కూడిన సామ్రాజ్యవాద శిబిరమూ అను రెండు విభిన్న శిబిరములుగా ప్రపంచం చీలిపోయింది. ఆనాడు పెట్టుబడిదారీ వర్గములోని మితవాద కూటమికి ప్రాతినిధ్యం వహిస్తూ కొమింటాంగ్‌లో వుండి విప్లవానికి జంగ్-కై-షేక్ చేయనున్న ద్రోహమునకు ప్రాతిపదిక వేసిన టాయ్‌ఛి-టావో ముఠా, వర్గ

సంఘర్షణ సిద్ధాంతమును వ్యతిరేకించింది. రష్యాతోను, చైనా కమ్యూనిస్టుపార్టీతోనూ కొమింటాంగ్ పొత్తుకుదుర్చుకొనుటను ఈ ముఠా ప్రతికూలించింది. రెండు పెద్ద శక్తులమధ్య "స్వతంత్రం"గా వుండాలని ఆశించింది. పెట్టుబడిదారీ వర్గ మొక్కటే అధికారాన్ని చలాయించే పాలనను తేవాలని వూహించారు. కామ్రేడ్ మావో వారి ప్రయత్నాలు పూర్తి దివాళాకోరుతనానికి దారితీస్తాయని గుర్తుచేశాడు. మధ్యవర్గాలు క్షీణించిపోవుట తప్పనిసరి. జాతీయబూర్జువావర్గం అతివాదం వైపునువెళ్ళి రష్యాతోనూ, కమ్యూనిస్టుపార్టీతోనూ మిత్రత్వం ఏర్పర్చుకొని, కార్మికవర్గనాయకత్వాన్నంగీకరించి, సామ్రాజ్య వ్యతిరేక ప్రపంచవ్యాప్త పోరాటంలో చేతులు కల్పనైనా కల్పాలి. లేదా మితవాదంవైపుకు పోయి రష్యాను, కమ్యూనిస్టుపార్టీని, కార్మికవర్గ విప్లవాన్ని ప్రతికూలిస్తూ, సామ్రాజ్య వాద బంటుగానైనా తయారుగావాలి. ఇవి రెండూ తప్ప మరో "స్వతంత్ర" మార్గం లేనేలేదు. ఆకాలంలో సరిగా యిదే జరిగిందని అందరికీ తెలిసిందే. జాతీయబూర్జువావర్గంలోని మితవాదవర్గం, జంగ్-కై-షేక్ అవలంబించిన విప్లవ ప్రతీఘాతుక చర్యలలో జంగ్-కై-షేక్‌ను అనుసరించి సామ్రాజ్య వాదం వైపుకు పోయింది.

జపాన్ వ్యతిరేక ప్రతిఘటనా ఉద్యమసందర్భంలో కమ్యూనిస్టుపార్టీ యొక్క చొరవ, నాయకత్వముల వలన, విశాలజాతీయైక్యసంఘటన పునఃస్థాపించబడింది. కాని కొమింటాంగ్‌లోని కరుడుగట్టిన ముఠా, పెట్టుబడిదారీ నియంతృత్వం అనే తుప్పుపట్టిన సిద్ధాంతమును తిరిగి లేవనెత్తింది. జంగ్-కై-షేక్ ప్రాతినిధ్యం వహిస్తున్న పెద్ద భూస్వాములు, నిరంకుశ

పెట్టుబడిదార్ల నియంతృత్వమును, కుమింటాంగ్ యొక్క ఏక పార్టీ నియంతృత్వమును, కామ్రేడ్ మావో వర్ణించినట్లు, అర్ధవలస, అర్ధభూస్వామ్య నియంతృత్వమును మారుపేర్లతో కప్పిపుచ్చి పరిరక్షించుకొనుటయే వీరి అసలువుద్దేశం. మరో వైపు మన పార్టీలోనే మితవాద అవకాశవాదం తిరిగి తలెత్తి కార్మికవర్గమును పెట్టుబడిదారీవర్గపు తోకగా మార్చడానికి ప్రయత్నించింది. కుమింటాంగ్ అభివృద్ధి నిరోధకుల తప్పులతడక వాదనలను బహిర్గతమొనర్చి పార్టీలోని మితవాద అవకాశ వాదమును రూపుమాపి, తద్వారా జాతీయ ఐక్యసంఘటనలో చైనా కార్మికవర్గమూ, ప్రజాబాహుళ్యమూ, మనపార్టీ తమ పాత్రను నెరవేర్చుటకొరకై కామ్రేడ్ మావో 'నూత్న ప్రజా స్వామికము' అనే గ్రంథమును రచించారు.

వలస, అర్ధవలసదేశాలలోని విప్లవములనుగూర్చి లెనిన్, స్టాలిన్‌లు చేసిన సిద్ధాంతీకరణను కామ్రేడ్ మావో యీ గ్రంథంలో అభివృద్ధిపర్చి, నిర్దిష్ట మొనరించి మరింత మెరుగుపెట్టారు. స్టాలిన్ రచనలను వుల్లేఖిస్తూ, చైనా విప్లవంలో బయిల్వెడలిన అనుభవమును ఆధారముగాగొని, కామ్రేడ్ మావో చైనావిప్లవముయొక్క ప్రధానలక్ష్యమును వివరించారు. చైనా విప్లవగమనముయొక్క ప్రధాన మార్గ మును విపులీకరించారు.

మావో యిలా వివరిస్తున్నారు:

"ప్రథమ సోషలిస్టు విప్లవమగు అక్టోబరు మహావిప్లవం ప్రపంచ చరిత్రయొక్క గమనమునే మార్చివేసింది. ప్రపంచ చరిత్రలో నూత్నయుగము నారంభించింది."

ఆయన యింకా యిలా అన్నారు :

"ఈ యుగములో ప్రపంచములోని ఒకభాగంలో (ప్రపంచములో ఆరోవంతు భూభాగము) పెట్టుబడిదారీ విధానం కూలిపోయింది. మిగతా ప్రపంచమంతటాకూడా పెట్టుబడిదారీ విధానం క్షీణిస్తున్నది. పెట్టుబడిదారీ వర్గపు అవశిష్టాలు, వలస, అర్ధవలసదేశాలపై అధికంగా ఆధార పడనిదే బ్రతుకలేవు. ఒక సోషలిస్టు ప్రభుత్వమేర్పడి, వలస, అర్ధవలసదేశాల ప్రజలు తమతమ విముక్తికోసం సాగిస్తున్న వుద్యమాలకు బాసటగా నిలుస్తానని హామీనిచ్చింది. పెట్టుబడి దారీ దేశాల్లోని కార్మికవర్గం దినదినమూ సోషల్ డెమాక్రటిక్ పార్టీల గుప్తసామ్రాజ్యవాద ప్రభావంనుండి బయటపడుతూ, వలస, అర్ధవలస దేశాలలోని విముక్తి పోరాటాలకు సహాయం చేస్తామని ప్రకటిస్తున్నది. ఇట్టిలక్షణములు కల్గియున్న యీ యుగములో అంతర్జాతీయ పెట్టుబడిదారీ విధానము, అంత ర్జాతీయ సామ్రాజ్యవాదములకు వ్యతిరేకంగా వలస, అర్ధవలస దేశాలలో జరిగేవిప్లవములు ప్రపంచపెట్టుబడిదారీ విప్లవముల కోవకు చెందినవికావు. అవి ఒక కొత్తతరహా విప్లవములు. కార్మికవర్గ సోషలిస్టు ప్రపంచ విప్లవంలో అవి భాగములు"

వలస, అర్ధవలస దేశాల విప్లవములపట్ల మార్క్సిస్టు - లెనినిస్టు అంచనాయిది. ఈ అంచనానుండియే చైనావిప్లవపు ప్రధానలక్ష్యములు, గమనము వుద్భవిస్తాయి. చైనా విప్లవము కార్మికవర్గ సోషలిస్టు ప్రపంచవిప్లవంలో భాగమే. దీనినుండి యీ క్రింది వివరణలు వస్తాయి.

1. "ఇట్టి విప్లవము సామ్రాజ్యవాదముపై బలమైన దెబ్బ తీస్తుంది. అందువల్ల యీ విప్లవాన్ని సామ్రాజ్యవాదం

బలపర్చడు సరిగదా ప్రతిఘటిస్తుంది. యీ విప్లవమును సోషలిజం ఆమోదిస్తుంది సోషలిస్టు ప్రభుత్వమూ, అంతర్జాతీయ కార్మికవర్గమూ దీన్ని బలపర్చుతాయి." "ఈప్రపంచంలో సామ్రాజ్యవాదం మొత్తంగానే మనశత్రువు. సోషలిస్టు ప్రభుత్వము, అంతర్జాతీయ కార్మికవర్గముల సహాయం లేనిదే చైనా స్వతంత్రమును పొందలేదు; సోవియటు యూనియన్ సహాయములేనిదే యిది సాధ్యంగాదు. అంతేగాదు. జపాన్, ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీలలోని కార్మిక వర్గాలు ఆయా దేశాలలోని పెట్టుబడిదారీ విధానములను ప్రతికూలంగా పోరాటాలు సాగించుటద్వారా చైనావిప్లవమునకు సహాయంచేయాలి."

2. "...వలస, అర్ధవలసదేశాలలోని వీరులు, సామ్రాజ్యవాద సంఘటనవైపు నిలబడి ప్రపంచవిప్లవ ప్రతీఘాతుక శక్తుల్లో చేరిపోవాలి, లేదా సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనలో చేరి ప్రపంచ విప్లవశక్తులతోనైనా కలిసిపోవాలి. ఇంతకు మినహా వేరే మార్గంలేదు. అందువల్ల వారు ఏదో ఒకదానితో చేరిపోవాలి"

"సోవియట్ యూనియన్‌కూ, సామ్రాజ్యవాద శక్తులకూ మధ్య పోరాటం తీవ్రమైనకొద్దీ, ఎవరివైపు చేరాలనేదాన్ని చైనా తేల్చుకోవాల్సివుంటుంది. ఏవైపుకు మొగ్గకుండా వుండటం అసాధ్యం. అలా వుండగలమనుకోవడం భ్రమమాత్రమే. ఇకనుండి ప్రపంచంలోని దేశాలన్నీ ఏదో ఒకవైపుకు చేరిపోక తప్పదు. 'తటస్థత' అనేది మోసం చేయడానికి చెప్పేమాట మాత్రమే.

3. "ప్రపంచం యీనాడు యుద్ధాలు, విప్లవాల యుగంలో నున్నది. ఈ యుగంలో, పెట్టుబడిదారీ విధానం నిస్సంశయంగా నశిస్తున్నది. సోషలిజం నిశ్చయంగా వికశిస్తున్నది. ఇట్టి పరిస్థితుల్లో, చైనాలో సామ్రాజ్యవాదము, భూస్వామ్యవర్గాలకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో విజయం సాధించిన వెనుక, పెట్టుబడిదారీ నియంతృత్వముక్రింద పెట్టుబడిదారీ వ్యవస్థను నెలకొల్పాలనుకోవడం వెర్రివెంగళప్పతనమే." "చైనా పెట్టుబడిదారీ వర్గంలోని తలబిరుసు పెద్దమనుష్యులు యీ విషయాన్ని గుర్తించకపోతే పరిస్థితులు విషమిస్తాయనడం మాత్రం వాస్తవం. అది వారు కోరితెచ్చుకొన్న వురిమాత్రమే."

4. "...కమ్యూనిస్టు సిద్ధాంతమూ, కమ్యూనిస్టు సాంఘిక వ్యవస్థలు యీనాడు, హిమగిరులనైనా వూపివేసి, సప్తసముద్రాలను క్షుభితం చేయగల పిడుగుపాటు మహత్తర శక్తితో, విశ్వవ్యాప్తి నొందుతున్నాయి, అవి నిత్యనూత్నంగా నిత్యయౌవనంతో విరాజిల్లుతున్నాయి. శాస్త్రీయ కమ్యూనిజము చైనాలో ప్రవేశించిన నాటినుండి, చైనాప్రజల అవగాహనశక్తి వృద్ధియైంది, చైనా విప్లవంయొక్క స్వరూపం మారిపోయింది. కమ్యూనిజంయొక్క నాయకత్వం లేనిదే, కమ్యూనిస్టు విప్లవంమాట అటుంచినా, కనీసం ప్రజాతంత్ర విప్లవమైనా జయప్రదం కాజాలదు ... ... ఈరోజు ప్రపంచ విముక్తి కమ్యూనిజంపైననే ఆధారపడివుంది అట్లే చైనా కూడా." "కమ్యూనిజమును వ్యతిరేకించ నుంకించేవారంతా మట్టిలో కలిసిపోతారు."

10 సంవత్సరాలక్రితం తాను వ్రాసిన 'నూత్న ప్రజాస్వామికం' అనే గ్రంథంలో కామ్రేడ్ మావో పై విషయా

లన్నీ స్పష్టీకరించాడు. ఆనాటినుండి, తన రచనలన్నిటిలోనూ వీటిని అభివృద్ధిపరుస్తూనే వచ్చారు. ఆయనచేసిన సూత్రీకరణలు సరియైనవేనని, యావత్ప్రపంచంలోనూ, చైనాలోనూ జరిగిన పరిణామాలు నిరూపించాయి.

ఈ విషయములను విశదీకరించుటతో పెట్టుబడిదారీవర్గ సంకుచిత జాతీయతకు తీరని దెబ్బతగిలింది. వెనుకబడియున్న, వేరుపడియున్న తమ ప్రపంచంతోనే సంతృప్తిపడే పెటీ బూర్జువా జాతీయ అహంకారాలను రూపుమాపింది.

ఈ యుగం సామ్రాజ్యవాదము, కార్మికవర్గ విప్లవముల యుగమనే దృక్పథముతోనూ, మార్క్సు, ఏంగెల్సు లెనిన్, స్టాలిన్ల, ప్రత్యేకంగా లెనిన్, స్టాలిన్ల బోధనలను ప్రయోగించుటతోనూ, చైనా విప్లవమును అధ్యయనంచేసి, పరిశీలించాలి. దద్వారా యీ మూలసూత్రమును అభివృద్ధి చేస్తూ, చైనా విప్లవమును సరైనమార్గంలో పురోగమింపచేయాలి. చైనావిప్లవంపై కామ్రేడ్ మావో చేసిన సూత్రీకరణలు సూచించే సక్రమమైన విజయవంతమైన మార్గమిదే.

## కార్మికవర్గ నాయకత్వాన జరిగిన ప్రజాబాహుళ్యపు విప్లవం

అక్టోబరు సోషలిస్టు విప్లవంతో ప్రపంచ చరిత్రలో ప్రాథమికమైన మార్పులు జరిగాయి. చైనాలో కార్మికవర్గం రాజకీయ రంగంలో కాలిడుటతో చైనాచరిత్రలో ప్రాథమిక మార్పులు కలిగాయి. ఈ మార్పులు రాకపూర్వమైతే, చైనా విప్లవం, పెట్టుబడిదారీవర్గ నాయకత్వాన నడిచే పాతతరహా

ప్రజాతంత్ర విప్లవంగా వుండేది. కాని యీమార్పులు జరిగిన వెనుక మాత్రం చైనావిప్లవం కార్మికవర్గ నాయకత్వాన నడిచే కొత్తతరహా ప్రజాతంత్ర విప్లవంగా మారింది. అని కామ్రేడ్ మావో హెచ్చరిక చేశారు.

చైనాలో పార్టీపుట్టిన తర్వాత వచ్చిన మొదటివిప్లవ దశలో చెన్ టూ-షి యొక్క మితవాద అవకాశవాదమును తాను వ్యతిరేకించిన నాటినుండీ, కామ్రేడ్ మావో, కార్మిక వర్గ నాయకత్వమును గురించిన లెనినిస్టు - స్టాలినిస్టు సిద్ధాంతములకు ఎల్లప్పుడూ అన్నిపరిస్థితులలోనూ కట్టుబడియే వున్నాడు. చైనాలోని పరిస్థితుల కన్వయించి, యీ సిద్ధాంతమును మరింత నిర్దిష్ట మొనర్చాడు. జపాన్ వ్యతిరేక ప్రతిఘటనా యుద్ధపు ప్రధమదశలో కామ్రేడ్ మావో, అప్పుడప్పుడే తలఎత్తుతున్న మితవాద అవకాశవాదమునకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటం కొనసాగించాడు. కార్మికవర్గ నాయకత్వమును వదలివేసిన చెన్ టూ-షీ యొక్క అవకాశవాదంవల్ల సంభవించిన 1927 విప్లవపు ఓటమియొక్క గుణపాఠాలు నేర్చుకునేటపుడు చాలాశ్రద్ధ వహించాలని కామ్రేడ్ మావో వక్కాణించారు. కామ్రేడ్ లెనిన్ వ్రాసిన "ప్రజాతంత్ర విప్లవంలో సోషల్ డెమోక్రసీయొక్క రెండు ఎత్తుగడలు" అను మహత్తృష్ణ సిద్ధాంతగ్రంధమును తుణ్ణంగా అధ్యయనం చేయవలసిందిగా కామ్రేడ్ మావో చైనాకమ్యూనిస్టు పార్టీ సభ్యులకు ఎల్లప్పుడూ చెపుతుండేవారు. మిదవాద అవకాశ వాదమును ప్రతిఘటించుటలో యిది అత్యంతశక్తివంతమైన ఆయుధంగా కామ్రేడ్ మావో పరిగణించారు.

చైనా విప్లవంలో కార్మికవర్గం నాయకత్వ సమస్యకూ చైనా పెట్టుబడిదారీవర్గ బలహీనతకూ సంబంధముంది. 'చైనా విప్లవపురగమనం' (perspective) గురించి కామ్రేడ్ స్టాలిన్ 1926 లో వ్రాసిన వ్యాసంలో చైనా జాతీయపెట్టుబడిదారీ వర్గపు బలహీనతను గురించి ప్రస్తావిస్తూ యిలా అన్నారు :

"...కాని చైనావిప్లవమును ఆరంభించుట,నాయకత్వం వహించుట చైనా రైతాంగమునకు నాయకత్వం వహించుట అనునవి విధిగా చైనా కార్మికవర్గముయొక్క దానిపార్టీయొక్క చేతుల్లోకి పోవలసిందే."

కామ్రేడ్ మావో యిలా అన్నాడు :

"సామ్రాజ్యవాదము, భూస్వామ్యవర్గమూ, ప్రత్యేకంగా సామ్రాజ్యవాదము చైనా ప్రజలందరియొక్క బద్ధశత్రువులు అందువల్ల వీరిని కూలద్రోయడానికి ప్రజలను సమీకరించి నాయకత్వం వహించినవారే చైనాలో ప్రజల అభిమానాన్ని చూరగొంటారనేది స్పష్టం....చైనా పెట్టుబడిదారీవర్గం యీ కర్తవ్యాన్ని నెరవేర్చజాలదని చరిత్ర నిరూపించింది. అందువల్ల యీ బాధ్యత కార్మికవర్గంపైననే పడకతప్పదు."

కామ్రేడ్ మావో యిలా గుర్తుచేశారు. "చైనా విప్లవపు పురోగమనం రెండుమెట్లుగా విభజించబడుతుంది. మొదటిది ప్రజాతంత్ర విప్లవం. రెండవది సోషలిస్టువిప్లవం." ప్రథమదశయొక్క సామాజిక స్వభావాన్ని బట్టి ఆదశవాలికంగా పెట్టుబడిదారీ ప్రజాతంత్ర విప్లవమే. "...అయినా, దాని లక్ష్యం మాత్రం, పెట్టుబడిదారీ నియంతృత్వముక్రింద పెట్టుబడిదారీ వ్యవస్థను నెలకొల్పుటకై పెట్టుబడిదారీవర్గంచే

నాయకత్వం వహించి నడుపబడే పాతతరహావిప్లవం మాత్రం గాదు. ఇది కొత్తతరహావిప్లవం. ఈ విప్లవాన్ని కార్మికవర్గం నాయకత్వం వహించినడుపుతుంది. విప్లవవర్గాలన్నింటియొక్క సంయుక్త నియంతృత్వముక్రింద నూత్న ప్రజాస్వామిక సాంఘిక వ్యవస్థను నెలకొల్పుటయే ప్రథమదశలో దీని లక్ష్యం."

కామ్రేడ్ మావో యీ విప్లవాన్ని గురించి సరళంగాను, స్పష్టంగాను సూత్రీకరించి యిలా నిర్వచించారు:

"సామ్రాజ్యవాదము, భూస్వామ్యవర్గములకు వ్యతిరేకంగా, కార్మికవర్గనాయకత్వాన ప్రజాబాహుళ్యము సాగించే విప్లవమే నూత్న ప్రజాతంత్రవిప్లవం" కామ్రేడ్ మావో కొన్ని సందర్భాల్లో దీనినే "సామ్రాజ్యవాదము, భూస్వామ్య వర్గములకు వ్యతిరేకంగా నడిచే ప్రజాతంత్ర ప్రజాస్వామిక విప్లవమని"కూడా వర్ణించారు. చంగ్-కై-షేక్ నాయకత్వాన వున్న నాల్గు కుటుంబాలవారు, తాము సాగించిన దీర్ఘకాల విప్లవ ప్రతిఘాతుక పరిపాలనవల్ల చివరికి నిరంకుశ పెట్టుబడిదార్లు ముఠాగా తయారైనారు. అందువల్ల విప్లవస్వభావమునకు, నిరంకుశపెట్టుబడిదార్లకు ప్రతికూలంగా పోరాడాలనే మరో అంశముకూడా చేరింది. కామ్రేడ్ మావో యీ అంశాన్నికూడా తన సూత్రీకరణకు జతచేసి యిలాచెప్పారు. "సామ్రాజ్యవాదం, భూస్వామ్యవిధానం, నిరంకుశ పెట్టుబడిదారీ వర్గములకు వ్యతిరేకంగా, కార్మికవర్గ నాయకత్వాన ప్రజాబాహుళ్యము సాగించే విప్లవపోరాటం" అని చెప్పారు. ఇదే చైనావిప్లవపు ప్రథమదశలోని సాధారణ విధానంగా వుంటుందని మావో చెప్పాడు.

కామ్రేడ్ మావో యొక్క సూత్రీకరణలో ప్రజా బాహుళ్యం అని నిర్వచించబడినవారు ప్రధానంగా రైతాంగమే. ఈ విప్లవం కార్మికవర్గ రైతాంగ మిత్రత్వంపై ఆధారపడి సామ్రాజ్యవాదము, భూస్వామ్యవిధానము, నిరంకుశపెట్టుబడిదారీ విధానములకు వ్యతిరేకంగా పోరాడే వారందరినీ తనలో యిముడ్చుకుంటుంది. చైనాయొక్క భవిష్యత్తు నిర్ణయించుటలో కార్మికవర్గమూ, రైతాంగము, మేధావులు చిన్నపెట్టుబడిదార్లకు సంబంధించిన యితర శక్తులుచేరి మూలశక్తిగా పనిచేస్తాయనీ, కార్మికవర్గం నాయకత్వం వహిస్తుందనీ కామ్రేడ్ మావో చెప్పారు.

సహజంగా విప్లవానంతరం ఏర్పడే ప్రజాతంత్ర నియంతృత్వంకూడా యీవర్గాల ప్రాతిపదికపైననే ఆధారపడి వుంటుంది. ఈ నియంతృత్వము "కార్మికవర్గ నాయకత్వాన, విప్లవకరవర్గము లన్నింటితోకూడి ఏర్పడే సంయుక్త నియంతృత్వమనీ" లేదా "కార్మికవర్గ నాయకత్వాన, కార్మికవర్గము రైతాంగముల మిత్రత్వముపై ఆధారపడిన, ప్రజాతంత్ర ప్రజాస్వామిక నియంతృత్వమనీ" కామ్రేడ్ మావో నిర్వచించారు.

చైనా విప్లవంలో ఏర్పడే సమస్యల పరిష్కారమునకు కార్మికవర్గ నాయకత్వ సమస్య కీలకముగా వుంటుందని కామ్రేడ్ మావో అంచనా వేశారు. చైనా విప్లవ జయాపజయములకుకూడా యిది కీలకముగానే ఎంచబడింది. 1937 మేలో జపాన్ వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటన విషయమై మాట్లాడుతూ కామ్రేడ్ మావో యిలా చెప్పారు:

"కార్మికవర్గం పెట్టుబడిదారీ వర్గమును అనుసరించవలెనా? లేక పెట్టుబడిదారీవర్గమే కార్మికవర్గాన్ని అనుసరించ

వలెనా? చైనా విప్లవంలో నాయకత్వబాధ్యత ఎవరిది అనే యీ ప్రశ్నపైననే చైనావిప్లవపు గెలుపువోటములు ఆధారపడి వుంటాయి. 1946 లో ప్రచురించబడిన తన 'ప్రజాతంత్ర ప్రజా స్వామిక నియంతృత్వం' అనే ప్రసిద్ధ గ్రంథంలో మావో యిలా వ్రాశారు:

"కార్మికవర్గ నాయకత్వం లేకపోతే విప్లవం పరాజయం పొందుతుందనీ, కార్మికవర్గ నాయకత్వం వున్నట్లయితే విప్లవం విజయంగాంచుతుందనీ యావద్విప్లవచరిత్రా నిరూపిస్తున్నది. సామ్రాజ్యవాద యుగంలో, ఏ దేశంలోనూ, ఏయితరవర్గమూ, విప్లవాన్ని విజయవంతంగా నడిపించలేదు. చైనాలో జాతీయ బూర్జువావర్గము, పెటీబూర్జువావర్గములు అనేక పర్యాయములు విప్లవాలను నడిపాయి. కాని అవన్నీ పరాజయం పొందాయనేదే దీనికి నిదర్శనం."

కార్మికవర్గ నాయకత్వ సమస్యను పరిష్కరించుటలో, రైతాంగ సమస్య కీలకమైనదని కామ్రేడ్ మావో చెప్పారు:

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ యొక్క రెండో కాంగ్రెసుకు వలస, జాతుల సమస్యలపై తాను సమర్పించిన నివేదికలో కామ్రేడ్ లెనిన్ యిలా అన్నారు:

"వెనుకబడిన దేశాలలో కార్మికవర్గ పార్టీలు రైతాంగ వుద్యమాలతో ఖచ్చితమైన సంబంధాల నేర్పరచుకొని, వాటిని బలపర్చకుండానే, కమూనిస్టు విధానమును, ఎత్తుగడలనూ అనుసరించగలవనుకోవడం కలమాత్రమే."

"...జాతీయసమస్య వాస్తవంగా రైతాంగసమస్యయే" అని కామ్రేడ్ స్టాలిన్ అనేక సందర్భాలలో చెప్పారు.

చైనాపై కామ్రేడ్ మావో అవలంబించిన దృక్పథం, లెనిన్, స్టాలిన్‌ల వైఖరికి అనుగుణంగానే వుంది. దానినుండి అభివృద్ధినైనదే.

పెట్టుబడిదారీ ప్రజాతంత్రవిప్లవాలలో, కార్మికవర్గమూ పెట్టుబడిదారీవర్గాలమధ్యా, కార్మికవర్గమూ, మిగిలిన పార్టీల మధ్యా, యీ రైతాంగ సమస్యయే ప్రధానమైన విభేదంగా వుంటూ వచ్చింది. కామ్రేడ్ మావో వ్రాసిన 'మిశ్రమ ప్రభుత్వం' అనే వ్యాసంలో యిలా పేర్కొన్నారు:

"ప్రజా వ్యతిరేక కొమింటాంగ్ కూటమి తనకు అం బాటులోనున్న శక్తులనన్నింటినీ కూడదీసి, కమ్యూనిస్టుపార్టీ అన్నిరకాల దాడులను ప్రారంభించింది. బహిరంగ, రహస్య మిలిటరీ, రాజకీయ, దురాక్రమణ దాడులను సాగించింది.

"అయితే యీ రెండుపక్షాలమధ్య విభేదాలన్నీ, వాటి సాంఘిక పునాదులనుబట్టి చూచినట్లయితే, వాస్తవంగా భూసంబంధాల సమస్యపైననే ఆధారపడివుంటాయి."

రైతాంగవిప్లవంలో నాయకత్వం వహించుట యనునది కార్మికవర్గ నాయకత్వపాత్రకు ప్రధానమైన నిదర్శనమే. పెట్టుబడిదారీవర్గము రైతాంగ విప్లవాన్ని చూచి భయపడుతుంది; దాన్ని వ్యతిరేకిస్తుంది. ఆ వర్గము, రైతాంగ విప్లవమునకు నాయకత్వం వహించలేదు. గనుకనే పెట్టుబడిదారీ ప్రజాతంత్ర విప్లవమునకు కూడా నాయకత్వం వహించజాలదు. అందువల్లనే, కార్మికవర్గ నాయకత్వముంటేనే తప్ప, అసంఘటితంగానూ, అత్యంత విశాలముగానూ వున్న రైతాంగమును సుసంఘటితమైన, పోరాటశక్తిగా రూపొందించుట సాధ్యం

గాదు. అట్లే, కార్మికవర్గ రైతాంగముల ఐక్యత సాధించుటా గాని, యీ ప్రాతిపదికపై, విప్లవశక్తులన్నింటిని సమీకరించి మనవైపుకు త్రిప్పుకొనుటగాని, అంతర్జాతీయ విప్లవశక్తులతో చైనాదేశపు విప్లవశక్తులను ఐక్యపర్చుటగాని సాధ్యంగాదు.

"పెట్టుబడిదారీ ప్రజాతంత్ర విప్లవము పెట్టుబడదారీ వర్గపు సహాయమును పోగొట్టుకున్నట్లయితే ఆ విప్లవము వర్గప్రాధాన్యతను సాంఘికపునాదిని కోల్పోతుంది" అని ఛెన్-టూ-షీ ప్రథమ విప్లవదశలో వాదించేవాడు. అంటే పెట్టుబడిదారీ ప్రజాతంత్రవిప్లవపు "వర్గప్రాధాన్యత, సాంఘిక పునాది" అనునవి పెట్టుబడిదారీవర్గమున కొక్కదానికే సంబంధించినవని అతడు భావించాడు. రైతాంగసమస్య ఛెన్-టూ-షీ యొక్క బుర్రలోనికే ఎక్కలేదు. రైతాంగసమస్యకు సంబంధించే ఛెన్-టూ-షీతో సహా అవకాశవాదులంతా కార్మికవర్గ నాయకత్వమునకు వక్రభాష్యాలుచెప్పి దాన్ని వ్యతిరేకించారు. వారు మాటల్లోకూడా కార్మికవర్గ నాయకత్వాన్ని వ్యతిరేకించి, పెట్టుబడిదారీవర్గ నాయకత్వమును గుర్తించారు. ఈ విధంగా అసలు రైతాంగ విప్లవమునే ప్రత్యక్షంగా వ్యతిరేకించారు. ప్రథమ విప్లవదశలో చెన్‌టూ-షీయిజం చేసింది గాని, జపాన్ దురాక్రమణకు ప్రతిఘటనా యుద్ధపు ప్రారంభ దినాల్లో మితవాద అవకాశవాదం చేసిందిగాని యిదే. లేదా వారు "అతివాద" ముసుగువేసికొని, మధ్యతరగతి రైతాంగముతోనూ, పట్టణ పెటీబూర్జువా వర్గముతోనూ ఐక్యం గావలసిన అవసరాన్నే నిరాకరించారు. అట్లు వాస్తవంగా కార్మికవర్గ నాయకత్వాన్నే నిరాకరించారు. 10 సంవత్సరాల

అంతర్యుద్ధ కాలంలో "అతివాద" అవకాశవాదులు సరిగ్గా యిలాగే చేశారు.

కార్మికవర్గ నాయకత్వమూ, తద్వారా కార్మికవర్గ రైతాంగ మిత్రత్వమూ సాధించబడింది. అందువల్లనే సామ్రాజ్యవాదము, భూస్వామ్యవిధానము, నిరంకుశ పెట్టుబడిదారీ విధానంపై విజయం గాంచుట సాధ్యమైంది. "సామ్రాజ్యవాదమూ, అభివృద్ధి నిరోధక కుమింటాంగ్ ముఠాల పాలనను కూలద్రోయుటలో యీ రెండువర్గాలే ప్రధాన శక్తులుగా నున్నాయి" అని కామ్రేడ్ మావో చెప్పాడు. రెండోవైపున యీ రెండువర్గాల మిత్రత్వమువల్ల నూత్న ప్రజాస్వామిక విప్లవము, సోషలిస్టు విప్లవములోనికి అభివృద్ధి చెందుట సాధ్యమౌతుంది. "నూత్న ప్రజాస్వామికమునుండి సోషలిజమునకు పరిణామం చెందుటకూడా ప్రధానంగా యీ రెండువర్గాల మిత్రత్వముపైననే ఆధారపడి వుంటుంది" అని కామ్రేడ్ మావో చెప్పారు.

మనంకూడా అవకాశవాదుల వలెనే, కార్మికవర్గనాయకత్వ సిద్ధాంతమును వదలివేసినట్లయితే, విప్లవమును పరాజయములు, ఎదురుదెబ్బలవైపుకు తీసుకొనిపోయివుండేవారం. గతంలో కొన్ని చారిత్రక ఘటనలుకూడా దీనినే బలపరుస్తున్నాయి. ఇలాగే జరిగిన పక్షమున, చైనావిప్లవము యిప్పుడున్న దశకుగాని, భవిష్యత్తులో చేరుకోబోయె దశలోగాని వుండివుండేదిగాదు.

# గ్రామసీమల్లోని విప్లవప్రాంతాలనుండి దేశవ్యాప్త విప్లవవిజయమునకు పురోగమనం

దీర్ఘకాల యుద్ధానంతరం, ఒక స్థానంవెనుక మరొక స్థానం వశపర్చుకొనుటద్వారానే చైనావిప్లవం విజయపరంపరలు సాధించినదని అందరెరిగినదే. 1927 తర్వాత వశపర్చుకునే క్రమం పట్టణాలనుండిగాక పల్లెలనుండి ప్రారంభమైంది. 1926 తర్వాత, చైనా కమ్యూనిస్టుపార్టీ తన కార్యకలాపముల కేంద్రమును గ్రామసీమలవైపుకు మార్చింది. అక్కడ బలమును సమీకరించుకొని నగరాలను ముట్టడించి జయించుటయే దీనిలక్ష్యం. మనకార్యక్రమ విధానం యిలాగే వుండాలని కామ్రేడ్ మావో పట్టుబట్టాడు. ఇది సరైనవిధానం గావడం వల్లనే, యీవిధానం విజయవంతమైనదని చరిత్రయే నిరూపించింది.

మార్క్సిస్టు - లెనినిస్టు శాస్త్రీయ దృక్పథంతో చైనా పరిస్థితులను పరిశీలించి, యీవిధానం నిర్ణయించబడింది.

చైనా విప్లవ శత్రువులు అసంఖ్యాకులు. శక్తిపరులు కూడా. 1927 లోనే కామ్రేడ్ స్టాలిన్ యిలాచెప్పారు." చైనా విప్లవంయొక్క దేశీయ (ఛాంగ్‌సో-లిన్, జంగ్-కై-షేక్, బడాపెట్టుబడిదార్లు, రాజవంశీకులు, భూస్వాములు వగైరా) విదేశీయ శత్రువులు (సామ్రాజ్యవాదులు) అసంఖ్యాకులు, అత్యంత శక్తిమంతులుకూడా."

శక్తివంతమైన సామ్రాజ్యవాదులూ, భూస్వామ్య శక్తులూ, వారితో షరీకై ప్రజావ్యతిరేకులైన పెద్దపెట్టుబడి

దార్లతో కూడిన చైనా విప్లవశత్రు వర్గపు పరిస్థితిని వివరిస్తూ కామ్రేడ్ మావో యీక్రిందిసమస్యలను లేవనెత్తాడు.

"ఇలాంటి శత్రువులతో పోరాడవలసి యున్నందుననే చైనా విప్లవం, దీర్ఘకాలమైనదిగాను మొండిపోరాటంగాను వుంటుంది. శత్రువులు యింతటి శక్తివంతులు గావడంవల్ల దీర్ఘకాల వ్యవధిలేనిదే చైనావిప్లవశక్తులు పోరాటంలో పెరిగి కాకలుదీరి శక్తివంతమై శత్రువులను నాశనంచేయడం సాధ్యం గాదు. శత్రువు విప్లవమును అత్యంత క్రూరముగా అణచివేస్తున్నాడు. కాబట్టి తమ స్థావరాలను కాపాడుకోవాలన్నా, శత్రుస్థావరాలను చేజిక్కించుకోవాలన్నా, విప్లవశక్తులు రాటుదేలాలి. అందువల్ల చైనావిప్లవ శక్తులు ఒక్క తృటిలోనిర్మించబడతాయనిగాని, చైనావిప్లవం క్షణంలో విజయంపొందుతుందనిగాని ఆశించడం శుద్ధపొరపాటు.

"ఇట్టి శత్రువులున్నారుగాబట్టి," చైనావిప్లవగమనము, స్వరూపములు శాంతియుతంగా వుండక సాయుధంగా వుండుట అనివార్యం. రాజకీయస్వాతంత్రముగాని, హక్కులుగాని లేని ప్రజానీకం శాంతియుత కార్యకలాపములను కొనసాగించుటకు మన శత్రువుఎట్టి అవకాశమునూ కల్గించడు. "చైనాలో సాయుధ విప్లవశక్తులు సాయుధ విప్లవ ప్రతీఘాతుక శక్తులకు వ్యతిరేకంగా పోరాడుతున్నవి. ఇది చైనా విప్లవపు విశిష్ట లక్షణము ఒక సదవకాశమూకూడా" నని కామ్రేడ్ స్టాలిన్ చెప్పారు. ఇది నూటికినూరుపాళ్ళు సరైనసూత్రీకరణ. అందువల్ల సాయుధపోరాటాన్ని విప్లవ యుద్ధమునూ గెరిల్లాపోరాటమునూ, సైన్యము యొక్క ప్రాముఖ్యతను చిన్నచూపుచూచే దృక్పథము పూర్తిగా పొరపాటు.

"ఇట్టి శత్రువులున్నారుకాబట్టి, విప్లవప్రాంతాలను ఏర్ప రచుకునే ప్రశ్న వస్తుంది. బలమైన సామ్రాజ్యవాదము, దానితో చేరిపోయిన చైనాలోని అభివృద్ధినిరోధక శక్తులూ, చైనాలోని కీలకనగరములను దీర్ఘకాలంగా ఆక్రమించుకొని వున్నాయి, అందువల్ల, విప్లవశక్తులు, సామ్రాజ్యవాద తొత్తులకు, వారి మిత్రులు చైనా గుంటనక్కలకు వ్యతిరేకంగా రాజకీయపోరాటం కొనసాగించాలన్నా బలాన్ని కూడగట్టు కొని, రాటుదేలాలి, తగు శక్తిసామర్థ్యాలను ప్రోగుచేసుకొనక ముందే శత్రువుతో తాడోపేడో తేల్చుకునే పోరాటాలకు సిద్ధపడరాదు. వెనకబడియున్న గ్రామీణ ప్రాంతాలను అభి వృద్ధిచెందిన సువ్యవస్థిత స్థావరాలుగా, గొప్ప సైనిక, రాజ కీయ, ఆర్థిక, సాంస్కృతిక విప్లవకేంద్రాలుగా నిర్మించుకోవాలి. ఇలాచేసినపుడే నగరాలనుపయోగించుకొని గ్రామసీమలపై దాడి చేస్తున్న భయంకర శత్రువుతో పోరాడుతూ, క్రమేణా, దీర్ఘకాల పోరాటంద్వారా, పూర్తిగా విప్లవ విజయమును సాధించుట సాధ్యమవుతుంది."

సాయుధబలంద్వారా విప్లవ స్థావరాలను స్థాపించు కొనుట అనునది చైనా విప్లవమును దేశవ్యాప్త విజయము నకు కామ్రేడ్ మావో నడిపించిన పథమునను నాందీ ప్రస్తా వనగా వుంది. విప్లవస్థావరములను, అవి ప్రారంభములో ఎంత చిన్నవైనప్పటికీ, నెలకొల్పుటకావశ్యకమని కామ్రేడ్ మావో పేర్కొన్నారు. ఈ మార్గంలోనే పయనించినట్లయితే, ఒక చిన్న అగ్నికణం నుండి దావాగ్ని వుద్భవించవచ్చు. "ఈవిధం గానే మనం దేశవ్యాప్తంగా విప్లజన బాహుళ్యముయొక్క విశ్వాసమును చూరగొనగలం. సోవియట్‌యూనియన్

ప్రపంచమంతటి ప్రజల విశ్వాసమును యిలాగే చూరగొన్నది. ఇట్లు చేయుటద్వారానే, అభివృద్ధినిరోధక పాలకవర్గములకు తీరని చిక్కులుకల్పించి వారి పునాదులనే పూగించి, వారి ఆంతరంగిక పతనాన్ని త్వరితపర్చగలం; రాబోయే మహా విప్లవంలో ప్రధానాయుధంగా వుండే ఎర్రసైన్యమును వాస్తవంగా సృష్టించుకోగలం. క్లుప్తంగా చెప్పాలంటే, ఈవిధంగానే మనం విప్లవసంరంభమును వుధృతపర్చగలం."

దీర్ఘకాలం మనగల స్థావరాలను ఏర్పర్చగల అవకాశం ఎందుకు కలిగింది? యీ అవకాశమును ఎందువల్ల వినియోగించుకోవలసి వుంటుంది? పాతచైనాలో యీ క్రింది పరిస్థితులున్నాయని కామ్రేడ్ మావో వివరించారు :

"చైనాలో అసమాన రాజకీయ, ఆర్థిక అభివృద్ధివుంది. బలహీనమైన పెట్టుబడిదారీ విధానమూ, బలవంతమైన అర్ధ భూస్వామ్య విధానమూ ఒకదానిసరసను ఒకటి వున్నాయి. కొద్ది ఆధునికమైన పారిశ్రామిక, వ్యాపార నగరములు, అత్యంత విశాలమైన జడప్రాయమైన గ్రామసీమలూ ఒకదాని సరస నొకటి కన్పిస్తున్నాయి. లక్షలాది పారిశ్రామిక కార్మికులు, ప్రాచీన పాలనక్రిందనే వున్న కోట్లాది రైతాంగమూ, చేతిపనులవారూ ఒకరిప్రక్క నొకరు జీవిస్తున్నారు. కేంద్ర ప్రభుత్వమును చేజిక్కించుకున్న బలవత్తరమగు యుద్ధ ప్రభువులూ, రాష్ట్రాలేలుచున్న చిన్న యుద్ధప్రభువులూ పాలన సాగిస్తున్నారు. జంగ్-కై-షేక్ చేతిలోనున్న కేంద్రసైన్యమూ రాష్ట్రాలలో యుద్ధప్రభువుల చేతిలో వివిధ పేర్లతోనున్న కొండీమూకలు రెండురకాల అభివృద్ధినిరోధక సైన్యములు పని చేస్తున్నాయి. ఒకవైపున బహుస్వల్ప రైల్వే బాటలు,

మోటారు రోడ్లు, వేరొకవంక అసంఖ్యాకమైన గోతులు పడిపోయిన బాటలు, పాదచారులకు ఉపయోగించే కాలి బాటలూ వున్నాయి. వాటిలో అనేకం పాదచారులు నడవ డానికికూడా వుపయోగపడవి వే.

"చైనా అర్థవలస దేశం. సామ్రాజ్యవాదులలోనున్న అనైక్యత ఫలితంగా, చైనా పాలకవర్గమందలి ముఠాల్లో అనైక్యత ఏర్పడింది. ఒకేదేశం చేతిక్రిందనున్న వలసదేశము నకూ, అనేక దేశాలక్రిందనున్న అర్థవలస దేశానికీ తేడావుంది.

"చైనా అత్యంత విశాలమైన దేశం. తూర్పున చీకటి వుండగానే పశ్చిమాన కాంతి ప్రసరిస్తుంటుంది. దక్షిణాన రాత్రి ప్రవేశించిన సమయానికి వుత్తరాన తెల్లవారు తుంటుంది. కనుక తిరగడానికి స్థలంలేదనే విచారమక్కరలేదు. యిందు వివిధ ప్రాంతాలమధ్య విపరీతమైన వ్యత్యాసా లున్నాయి; విభిన్నమైన ఆర్థిక వ్యవస్థలూ సంస్కృతీ వున్నాయి.

"చైనా ఎర్రసైన్యమునకూ, ఎర్రసైన్యముచు విప్లవంలో పాల్గొన్న ప్రజానీకమునూ సమర్థతతో నడపగలిగిన కమ్యూ నిస్టుపార్టీకీ బీజములు వేసిన మహావిప్లవం చైనాలో జరిగింది."

తెరవెనుకనున్న సామ్రాజ్యవాదంచే నడుపబడుతున్న చైనా పాలకవర్గములోని చీలికలు, తగాదాలను గురించి కామ్రేడ్ మావో ప్రత్యేకంగా నొక్కి చెప్పారు. ఆయన యిలా చెప్పారు: "విప్లవ ప్రతీఘాతుక ప్రభుత్వంలో దీర్ఘ కాలంగా చీలికలు, యుద్ధాలూ జరుగుతున్నందున కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన ఒకటి లేక అనేక విప్లవ స్థావరముల నేర్పర్చడానికి, వాటికి అన్నివైపులా అభివృద్ధినిరోధక పాలన

అలముకొనియున్నప్పటికీ, వాటిని రక్షించుకొనుటకూ అవకాశం జిక్కింది."

"చైనాలోని అభివృద్ధినిరోధక ప్రభుత్వంలో చీలికలు, యుద్ధాలూ నిరంతరం జరుగుతుంటాయని గుర్తించినట్లయితే విప్లవ రాజకీయపాలన వుద్భవించి, నిలద్రొక్కుకొని, దినదిన ప్రవర్ధమానమవుతుందనుటలో ఎట్టి సందేహమూ పెట్టుకోనక్కరలేదు."

పై విషయాలన్నింటినీ చూచినట్లయితే లెనిన్, స్టాలిన్‌లు ప్రబోధించిన, వివిధ దేశాలలో పెట్టుబడిదారీ విధానపు అసమాన రాజకీయ, ఆర్థికాభివృద్ధి సిద్ధాంతమును కామ్రేడ్ మావో అర్ధవలసదేశమగు చైనాకు ఎంతటి ప్రజ్ఞతో అన్వయించాడో బోధపడుతుంది. చైనాలోని వాస్తవ పరిస్థితులను శల్యపరీక్ష చేసిన తర్వాత యీక్రింది సమగ్ర సూత్రీకరణలు చేశాడు: చైనాయొక్క రాజకీయ, ఆర్థికాభివృద్ధి చాలా అసమానంగా నున్నందున, విప్లవాభివృద్ధికూడా అసమానంగానే వుంటుంది. శత్రువుయొక్క బలహీనతను అవకాశంగా తీసుకొని, గ్రామసీమల్లో మొదటగా విజయం సాధించుట సాధ్యమౌతుంది. దీనితోపాటే గ్రామసీమల్లో, దీర్ఘకాల విప్లవస్థావరముల నేర్పర్చుకొనుట సాధ్యమౌతుంది.

1927 విప్లవం పరాజయం పొందినతర్వాత కామ్రేడ్ మావో చేసిన యీ సూత్రీకరణలు విప్లవమునకత్యంత ప్రాముఖ్యమైనవి. 1936 లో కామ్రేడ్ మావో యిలా జ్ఞాపకంచేశారు:

"చైనాలో గెరిల్లాపోరాటం ప్రారంభించబడగానే, హునాన్ - కియాంగ్సి సరిహద్దుప్రాంతంలోని కొంతమంది

కామ్రేడ్ను, మనం ఎంతకాలం ఎర్రజండాను నిలబెట్టగలం? అనే ముఖ్యమైన ప్రశ్న వేశారు. నిజానికిది చాలా ముఖ్యమైన ప్రశ్న. చైనా విప్లవపు స్థావరాలు, ఎర్రసైన్యమూ బ్రతికి బట్టగట్ట గలవా? అనే ప్రశ్నకు సమాధానం చెప్పకుండా మనం ఒక్క డుగు కూడా ముందుకు వేయలేం. అందువల్లనే, హునాన్ - కియాంగ్సీ సరిహద్దుప్రాంత పార్టీ ప్రథమ మహాసభలోనే దీన్ని గురించి హెచ్చరించవలసి వచ్చింది."

జంగ్-కై-షేక్, వాంగ్-చింగ్-వీల విప్లవ ప్రతీఘాతుక శక్తులకు వ్యతిరేకంగా, కామ్రేడ్ మావో చైనా విప్లవశక్తు లను చింకాంగ్ పర్వతప్రాంతములకు నడిపించుటత్యంత శౌర్యోపేతమైన చర్య. ఈ దాడివల్లనే మొట్టమొదటి విప్లవ స్థావరం ఏర్పడింది. ప్రజానీకం బాధలకు తీవ్రంగా గురియౌ తున్న కాలంలో యిది జరుగుటవల్ల యీ విప్లవస్థావరం, చైనాజాతి యంతటా ఆశారేఖలు వెదజల్లింది. దాని వెంటనే అనేక విప్లవస్థావరములు నెలకొల్పబడ్డాయి.

1927 విప్లవం పరాజయం పొందగానే ఛెన్ టూ-షీ లొంగుబాటుదార్ల ముఠాకు విప్లవంలో ఆశలుడిగి పార్టీని విప్ల వాన్ని రద్దుచేయ బూనుకున్నారు. కామ్రేడ్ మావో యొక్క పంథాను, విప్లవ ప్రతీఘాతుక శక్తులకు వ్యతిరేకంగా ఆయన నడిపిన వీరోచితప్రస్థానాన్ని వారు వ్యతిరేకించారు. వారు లోగడనే రైతాంగవిప్లవమును నిరాకరించినందువల్ల ట్రాట్స్కీ యిస్టులతో చేరిపోవడానికి వీలుకలిగింది. అనతికాలంలో వారు ట్రాట్స్కీముఠాతో సంబంధా లేర్పర్చుకున్నారు. అందువల్లనే వారు పార్టీనుండి తరిమివేయబడినారు. ఛెన్ టూ-షీ ట్రాట్స్కీ ముఠాకు, జంగ్ కై-షేక్ యొక్క అభివృద్ధినిరోధక పాలననూ,

కుమింటాంగ్ అభివృద్ధినిరోధకుల బలాన్నీ పొగడ్డంతోనే వారి కాలం సరిపోయింది. జంగ్-కై-షేక్ సాగించిన విప్లవప్రతీఘాతుక యుద్ధమును "ఐక్యపర్చు యుద్ధంగా" కొనియాడారు. "అభివృద్ధినిరోధకులలో ఏకీభవిస్తున్నా" మని చెప్పుకునేంత సిగ్గుమాలినస్థితికి పతనమైనారు. కామ్రేడ్ మావోను, చైనా విప్లవమును తెగనాడ్డానికి, శాపనార్థాలు పెట్టడానికి విషపూరితమైన పదాలను దొర్లించారు. హేయమైన విప్లవ ప్రతీఘాతుక ముఠాగా దిగజారిన ఈ కుచ్ఛికాయ పెద్దమనుష్యులు, అత్యంత నీచమైన సామ్రాజ్యవాద, విప్లవఘాతుక శక్తుల బంట్లుగా పనిచేశారు.

మన పార్టీలోని కొంతమంది కామ్రేడ్స్ పెటీబూర్జువా విప్లవ తొందరపాటును ప్రదర్శించారు. జంగ్-కై-షేక్ సాగించిన వూచకోతవిధానాన్ని అసహించుకున్నారు. చెన్-టూ-షీ యొక్క దాసోహమనే విధానాన్ని తీవ్రంగా ఖండించారు. కాని, దీర్ఘకాలం, మొండిగా, విప్లవాన్ని కొనసాగించే ఓరిమి మాత్రం వారిలో లోపించింది. గ్రామసీమల్లోని విప్లవస్థావరాలను దీర్ఘకాలం రక్షించుకునేసమస్యపై వారు ఓర్పు ప్రదర్శించలేక పోయారు. తత్ఫలితంగా, విప్లవం అల్పవ్యవధిలోనే విజయం పొందుతుందనే సిద్ధాంతం తలెత్తింది. చైనాయొక్క రాజకీయ, ఆర్థిక అసమానతను వారు గుర్తించలేదు. విప్లవంకూడా అసమానంగానే అభివృద్ధియగుననే సిద్ధాంతాన్ని వారు త్రోసివేశారు. ఒక్క సుముహూర్తాన విప్లవం విజయవంతం కాగలదనీ, అనేక పట్టణాలను స్వల్పకాలంలోనే పట్టుకోవడం సాధ్యమౌతుందనీ వారు భ్రమపడ్డారు. ఇట్టి తరహా అతివాద దుందుడుకుతనం పార్టీలో మూడుపర్యాయాలు పైచేయి సంపా

ించి కామ్రేడ్ మావో సూచించిన సరైన విధానమును వ్యతిరేకించింది. విప్లవానికి నష్టాలు చేకూర్చింది. కామ్రేడ్ లిలిసాన్ యొక్క దుందుడుకుతనం పోయినతర్వాత, కామ్రేడ్స్ వాంగ్‌మింగ్, ప్రో-కూలు మూడవసారి అవలంభించిన దుందుడుకు విధానంవల్ల విప్లవానికి పెద్దనష్టాలు సంభవించాయి. ఇట్టి దుందుడుకు చేష్టలవల్ల ఏర్పడిన క్లిష్ట పరిస్థితిలో కామ్రేడ్ మావో యొక్క నాయకత్వమే దారిచూపింది.

విప్లవస్థావరాలు, సాయుధపోరాటంద్వారానే ఏర్పడి, సంరక్షించబడ్డాయి. అందువల్ల విప్లవస్థావరాలకూ, విప్లవ యుద్ధపు కీలకసమస్యలకూ అవినాభావ సంబంధం వున్నది. కాబట్టి విప్లవస్థావరాలకు సంబంధించిన యీ వివాదం వాస్తవంగా, విప్లవ యుద్ధంయొక్క కీలకసమస్యలపై వివాదమే. కామ్రేడ్ మావో, చైనావిప్లవపు సుదీర్ఘకాలాభివృద్ధిలో, గెరిల్లాపోరాటమును అత్యంత కీలకసమస్యగా ఎంచి, దాన్ని ఆదృష్టితోనే అధ్యయనం చేశారు. మిలిటరీశాస్త్రమునకు కామ్రేడ్ మావో చేకూర్చిన మహత్తరమైన అస్త్రము ఇది." "...ఇట్టి విప్లవస్థావరములలో సాగించే దీర్ఘకాల విప్లవ పోరాటంలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన జరిగే రైతాంగ గెరిల్లా పోరాటాలే ప్రధానంగా వుంటాయి. గ్రామీణ ప్రాంతాల్లో విప్లవస్థావరాలు నెలకొల్పుటనుగాని, రైతాంగంలో కష్టతరమైన కృషినిగాని, గెరిల్లాయుద్ధాన్నిగాని నిర్లక్ష్యం చేసే వైఖరులన్నీ పూర్తిగా పొరపాటు" అని కామ్రేడ్ మావో స్పష్టంచేశారు.

10 సంవత్సరాల అంతర్యుద్ధకాలంలో, గ్రామీణ స్థావరాల్లో దీర్ఘకాలం నిలద్రొక్కుకునే సమస్య "అతివాదను" అవ

కాశవాదులు అలక్ష్యం చేశారు. దానితో బాటే, గెరిల్లాపోరా టాన్ని, స్వల్పవిజయాలను సాధించుటద్వారా మహత్తర విజయాలు సాధించే పద్ధతినే వారు మర్చిపోయారు. విప్లవ యుద్ధంలో గెరిల్లాపోరాట స్వరూపము ప్రధానమైన రూపములుగా వారు అంగీకరించలేదు. శత్రువుయొక్క-మనయొక్క- బలాబలాలమధ్య ఎంతో వ్యత్యాసముందని తెలిసికూడా, ముఖాముఖి యుద్ధంద్వారానే నిర్ణాయిక పోరాటాలు సాగించగల మనే భ్రమలో పడ్డారు. లోప భూయిష్టమైన యీ వ్యూహమువల్ల విప్లవస్థావరములు పోగొట్టుకోవడం సంభవించింది. క్షణంలో విజయం సాధిస్తా మనే వారి ప్రగల్భాలు విఫలంగావడంతో వారంతా మిత వాదం వైపుకుమొగ్గి నిరాశావాదంలో మునిగిపోయారు. జపాన్ వ్యతిరేక ప్రతిఘటనా పోరాటంలో వ్యూహానికి సంబం ధించికూడా సత్వరవిజయం సాధ్యమనే వైఖరినే వారు అవలం భించారు. గ్రామీణ ప్రాంతాల్లోని జపాన్ ప్రతికూలవిప్ల స్థావరాలను భద్రపర్చుకొని జపాన్ వ్యతిరేక గెరిల్లా పోరా టమును సంరక్షించుకొని, వాటిని విస్తృతం చేసుకోవడంలో గాని వారికెట్టి ఆసక్తిలేదు. ప్రజాయుద్ధములోకూడా ముఖా ముఖి యుద్ధాలనే ఆచరించాలన్నారు. యుద్ధప్రారంభ దినాల్లో శత్రువుయొక్క- మనయొక్క- బలాబలాలలో ఎంతో వ్యత్యాసమున్నదనే విషయం వారికి పట్టనేలేదు. 10 సంవత్స రాల అంతర్యుద్ధకాలంలో వారు అవలంభించిన వైఖరినే యీ దశలోకూడా ప్రదర్శించారు. జపాన్ వ్యతిరేకపోరాటకాలంలో వారికి ప్రజలశక్తిలో నమ్మకం పోయిందనే విషయాన్ని మాత్రం ప్రదర్శించుకున్నారు. కుమింటాంగ్‌సైన్యం సాగిస్తున్న

యుద్ధంపైననే జపాన్ వ్యతిరేక యుద్ధపువిజయం ఆధారపడి వుంటుందని వారు ఆశించారు. సాయుధప్రజాశక్తులయొక్క పాత్రనుగాని, భవిష్యత్తునుగాని వారు చూడలేకపోయారు.

"మొత్తమును భాగములుగా విడగొట్టుట" "ప్రజల నుత్సాహపర్చుటకుగాను శక్తులను విడదీయుట" కొన్ని సందర్భాలలోనూ, "భాగములను ప్రోగుచేయుట" "శత్రువుతో పోరాడవలసి వచ్చినపుడు శక్తులను కూడదీసుకొనుట" మరి కొన్ని సందర్భాలలోనూ, చేయవలసి వుంటుంది. అదే కామ్రేడ్ మావో సూచించిన గెరిల్లాయుద్ధవిధానం. గెరిల్లాయుద్ధ విధానమును సాధ్యమైనంతమేరకు పెద్దపెట్టున అభివృద్ధిపర్చి, ఆ తర్వాత మనబలం వృద్ధియైనవెనుక, కొన్ని పరిస్థితులలో 10 సంవత్సరాల అంతర్యుద్ధపు ఆఖరిరోజులలోవలె, గెరిల్లా పోరాట విధానమును రెగ్యులర్ యుద్ధంగా మార్పుచెందించాలి. ఈ కాలంలో రెగ్యులర్ యుద్ధంకూడా గెరిల్లాస్వభావం గల్గి మొబైల్ యుద్ధంగానే వుంటుంది. ఇతర పరిస్థితులలో శత్రువు చేసిన మార్పుననుసరించి, రెగ్యులర్ యుద్ధంకూడా గెరిల్లా రూపంవహిస్తుంది. జపాన్ వ్యతిరేకపోరాట మొదటిదశలో యిలాగే జరిగింది. ఈ దశలో గెరిల్లా యుద్ధవిధానమే ప్రధాన పోరాటరూపంగా వుండేది. కాని అనుకూల పరిస్థితు లేర్పడినపుడు మొబైల్ యుద్ధాన్ని విడిచిపెట్టలేను. విప్లవశక్తుల బలం వృద్ధియగుటవల్లా శత్రువు చేసిన నూతనమార్పులవల్లా ఏర్పడిన నూతనపరిస్థితుల్లో, జపాన్ వ్యతిరేక ప్రతిఘటనా పోరాటపు ఆఖరిరోజుల్లోలాగా, గెరిల్లాపోరాటం రెగ్యులర్ పోరాటంగా మార్చబడింది. జంగ్-కై-షేక్, అమెరికాలకు వ్యతిరేకంగా జరిగిన విముక్తిపోరాటంలోకూడా యిలాగే జరిగింది.

విముక్తి పోరాటపు ఆఖరురోజుల్లో, భారీఆయుధాలతో పెద్ద సైన్యాలు, శత్రువుయొక్క బలమైన స్థానాలపైన దెబ్బతీసే వరకు రెగ్యులర్ యుద్ధం అభివృద్ధి చెందింది. యుద్ధతంత్రంలో వచ్చిన యీమార్పులన్నీ విప్లవస్థావరాలలోవచ్చిన మార్పుల కనుగుణ్యంగానే జరిగాయి. విప్లవస్థావరాలు, చిన్నవి పట్టణాలతో గూడిన విశాలమైన స్థావరాలుగాను, సగభాగంలో సాధించిన విజయాన్ని మొత్తం చైనాకు వ్యాప్తంచేయుటకు వుపకరించాయి.

విప్లవము దేశవ్యాప్త విజయం సాధించిన వెనుక, మాతృదేశ రక్షణకై అధునాతనమైన సైన్యమును నిర్మించ వలసిన అవసరమును కామ్రేడ్ మావో గుర్తు చేశారు. కామ్రేడ్ మావో చైనా ప్రజా సమాలోచనా సమితిలో ప్రసంగిస్తూ యిలా అన్నాడు: "మన దేశీయ రక్షణను బలవత్తరం చేయాలి. ఏ సామ్రాజ్యవాదదేశాన్నీ మన భూభాగంపైదండెత్తనీయరాదు. శౌర్యోపేతమగు ప్రజావిముక్తి సైన్యపు పునాదిపై, మన జాతీయ సాయుధ బలాలను బలోపేతం చేయవలసి వుంటుంది. శక్తివంతమైన సైన్యంతోబాటు, బలీయమైన నౌకా, వైమానిక బలాలను ఏర్పర్చుకోవాలి." మనదేశంలో భాగమైన ఫార్మోజాను అమెరికా సామ్రాజ్య వాదం ఆక్రమించుట, కొరియా ప్రజాతంత్ర దేశంపై అమెరికా దురాక్రమణ సాగించుటవల్ల, అధునాతనమైన జాతీయ రక్షక బలాలను ఏర్పర్చుకోవలసిన అవసరాన్ని మరింతగా నొక్కి చెపుతున్నాయి. ఒకవైపున మన చైనా ప్రజానీకం వలంటీరు దళాలను ఏర్పర్చి, అమెరికా సామ్రాజ్యవాద దురాక్రమణ దారులకు వ్యతిరేకంగా కొరియా ప్రజాసైన్యంతో భుజం

భుజం కలిపి విజయవంతంగా పోరాటం సాగిస్తున్నారు. రెండో వైపున మనం, అధునాతనమైన సైన్యమును, పటిష్టమైన నౌకా, వైమానిక దళాలను నిర్మించుటకు చేతనైనదంతా చేస్తూన్నాము.

మార్క్సిస్టు-లెనినిస్టు గతితార్కిక వాదమును కామ్రేడ్ మావో, చైనా యుద్ధ వ్యూహమునకు విపులంగానూ, ప్రతిభావంతముగానూ అన్వయింపజేసి, గతితార్కిక వాదముయొక్క విశిష్టతను నిరూపించుటలో విజయం పొందాడు. కాని, అవకాశవాదులు, పిడివాదులకూ శత్రువుయొక్క మనయొక్క బలాబలాలను అంచనా వేయుట అనేది ఎప్పుడూ లేనే లేదు. రెగ్యులర్ యుద్ధ విధానంపైన మాత్రమే వీరు వక్కాణిస్తుండేవారు. గతితార్కిక వాదమును జీవితంనుండి వేరుచేశారు. అందువల్ల జీవితం వారికి యిక్కట్టులనే కొనితెచ్చింది.

## ఐక్యత, పోరాటములతో గూడిన విశాల ఐక్యసంఘటన

చైనా పూర్వం వ్యవసాయిక దేశం. ఇటీవల, వివిధ సామ్రాజ్యవాదులు దురాక్రమణ చేయుటతో దేశం అల్లకల్లోలమై అర్థవలస దేశంగానూ, లోగడ చెప్పినట్లుగానే ప్రాచ్యంలోని వైరుధ్యాల కన్నింటికీ కేంద్రముగానూ మారింది. అందువల్ల సామ్రాజ్యవాదము, భూస్వామ్య విధానము, నిరంకుశ పెట్టుబడిదారీ విధానములకు వ్యతిరేకంగా సాగిన చైనా నూతన ప్రజాతంత్ర విప్లవము, వివిధ వైరుధ్యములను పూర్తిగా వినియోగించుకొని, అవకాశమున్న శక్తుల

న్నింటినీ కూడగట్టుకొని, ప్రజా శత్రువులను ఒకరివెంట వొకరిని వోడించుట సాధ్యమైంది.

ఈ సందర్భములోనే, చైనా కమ్యూనిస్టుపార్టీ చరిత్రలో రెండురకాల పొరపాట్లు వచ్చాయి. ఒకటి మితవాద అవకాశ వాదం. దీనికి ఉదాహరణ: 1924-27 విప్లవదశలో తలెత్తిన ఛెన్‌టూ-షీయిజమూ, జపాన్ వ్యతిరేక ప్రతిఘటనా యుద్ధపు ప్రారంభ దినాల్లో కొంతమంది కామ్రేడ్సు చేసిన మితవాద అవకాశవాద పొరబాట్లు. ఈ మితవాద అవకాశవాదులు నియమరహితమైన ఐక్యసంఘటన కావాలని వాదించారు. తద్వారా, కార్మికవర్గమును పెట్టుబడిదార్ల తోకతుగా మార్చాలని ప్రయత్నించారు. "ఐక్యతేగాని పోరాటం లేనేలేదు" అని కామ్రేడ్ మావో యీ మితవాద అవకాశవాదమును పేరు పెట్టారు. రెండోది "అతివాద" అవకాశవాదం. 10 సంవత్సరాల అంతర్యుద్ధకాలంలో యిది మూడుపర్యాయములు పొడసూపింది. అసలు ఐక్యసంఘటనయే కూడదని వీరి వాదన. తద్వారా కార్మికవర్గాన్ని, వ్యవసాయకూలీలు, పేదరైతులను మిగతా వర్గాలనుండి వేరుచేయ ప్రయత్నించారు. కామ్రేడ్ మావో, యీ అతివాద అవకాశవాదమును "పోరాటమేగాని ఐక్యత లేనేలేదు" అని అవహేళన చేశారు.

చైనా విప్లవంలో అట్టి ఐక్యసంఘటన ఏర్పర్చుటకుగల అవకాశమునుగాని, కొన్ని పరిస్థితుల్లో అట్టి విశాల ఐక్య సంఘటన నిర్మించవలసిన అవసరమునుగాని నిరాకరించుట పెద్ద తప్పిదం. 1927 ఆగస్టులో, చైనా సమస్యపట్ల ట్రాట్స్కీ అనుయాయుల వాదనలను ఖండిస్తూ కామ్రేడ్ స్టాలిన్ యిలా అన్నారు: వలస, అధీనదేశాల్లోని విప్లవ సమస్యలను పరిష్క-

రించేటపుడు సామ్రాజ్యవాదదేశాల విప్లవములకు, సామ్రాజ్యవాదముచే పీడింపబడుతున్న దేశాల విప్లవములకుగల వ్యత్యాసమును ఖచ్చితంగా గుర్తించుటయే లెనినిజమ్‌యొక్క మూల విధానం. సామ్రాజ్యవాద దేశాలలోని పెట్టుబడిదారీ వర్గమునకు, వలస, అధీన దేశాల్లోని జాతీయ పెట్టుబడిదారీ వర్గమునకూ తేడా వుంది. సామ్రాజ్యవాద దేశాలలోని పెట్టుబడిదారీ వర్గము యితర దేశ ప్రజలను పీడిస్తూ "విప్లవముయొక్క ప్రతి దశలోనూ విప్లవాన్ని ప్రతిఘటిస్తుంది." సామ్రాజ్యవాదంచే పీడింపబడుతున్న దేశాల్లోని జాతీయ పెట్టుబడిదారీ వర్గము మాత్రం "సామ్రాజ్య వ్యతిరేకముగా జరుగుతున్న తనదేశ విప్లవమును ఒకానొక దశలో, కొంతకాలంపాటు బలపర్చుతుంది."

కాబట్టి, వలస, అర్ధవలసదేశాలలోని కార్మికవర్గము, కొన్ని చారిత్రక పరిస్థితుల్లో, ఆ దేశాలలోని జాతీయబూర్జువా వర్గముతో ఐక్యసంఘటన ఏర్పర్చుట సాధ్యమే.

ఈ ఐక్యసంఘటనలో కార్మికవర్గం తన వ్యక్తిత్వమును కోల్పోరాదు; తన స్వతంత్ర కార్మికోద్యమ స్వభావమును మాత్రం నిలబెట్టుకుంటూనే వుండాలి. కార్మికవర్గం ఆ ఐక్య సంఘటనలో తన నాయకత్వ స్థానమును ఏర్పర్చుకోవాలి. కామ్రేడ్ లెనిన్, స్టాలిన్‌లు యీ సూత్రమునే ప్రతిపాదించారు.

చైనా విప్లవానుగుణ్యముగానూ, కమ్యూనిస్టుపార్టీ కుమింటాంగులమధ్య ఏర్పడిన ఐక్యసంఘటనానుభవాన్ని దృష్టిలో పెట్టుకొని కామ్రేడ్ మావో, లెనిన్, స్టాలిన్‌లు ప్రతిపాదించిన యీ సిద్ధాంతమును మరింత అభివృద్ధిచేశాడు.

చైనా విప్లవములో ఐక్యసంఘటనపట్ల వహించవలసిన వైఖరికి కొన్ని నిర్దిష్టమైన సూత్రీకరణలు చేశారు.

చైనా కమ్యూనిస్టుపార్టీ చైనా పెట్టుబడిదారీ వర్గముల పట్ల, ముఖ్యంగా జపాన్ వ్యతిరేక ప్రతిఘటనా యుద్ధకాలంలో కుమింటాంగ్ పెద్దపెట్టుబడిదారీవర్గంపట్ల అనుసరించిన ఐక్య సంఘటనా ఎత్తుగడలకు, 'ఐక్యత, పోరాటం' అనే సిద్ధాంతం పునాదియని కామ్రేడ్ మావో చెప్పాడు. చైనా పెట్టుబడిదారీ వర్గం ద్వంద్వస్వభావం కలది గావడంచేతనే యీ ద్విముఖ విధానము ననుసరించవలసిన అవసరం కల్గింది. 'మడిగట్టుకు కూర్చునే' వైఖరి నవలంభించిన "అతివాదు"లు చైనాపెట్టుబడి దారీ వర్గపు యీ ద్వంద్వస్వభావమును గుర్తించలేదు. అందు వల్ల ఆవర్గముతో ఐక్యతకు అవకాశమున్నదని, అవసరమున్నదని గుర్తించలేదు. అట్లే మితవాద అవకాశవాదులుకూడా యీ వర్గపు ద్వంద్వస్వభావమును గుర్తించనందుననే, ఆ వర్గముతో పోరాడవలసిన అవసరమును గుర్తించలేదు. మితవాద, "అతి వాద" అవకాశవాదములు రెండింటితో, రెండురంగాలలో నిశితమైన నిశ్చయమైన పోరాటం సాగించాలని కామ్రేడ్ మావో స్పష్టంచేశారు.

ఈ రెండుతరహాల అవకాశవాదంయొక్క ప్రమాదం వివిధదేశల్లో, వివిధరూపాల్లో వుంది. పెట్టుబడిదారీ వర్గముతో ఐక్యసంఘటన నిర్మించకముందు "అతివాదు"ల 'మడిగట్టుకు కూర్చునే' వైఖరి పార్టీకి ప్రధాన ప్రమాదంగావుంది. ఐక్య సంఘటన ఏర్పడిన తర్వాత మితవాద లొంగుబాటుతత్వం పార్టీకి ప్రధాన ప్రమాదంగావుంది అని చైనావిప్లవచరిత్ర నిరూపిస్తున్నది. 1927 – 36 మధ్య జరిగిన రెండవ విప్లవ

అంతర్యుద్ధ కాలంలో, యీ "అతివాద" అవకాశ వాదులు, పెటీబూర్జువా వర్గంతో, ఐక్యసంఘటనను నిర్మించ వలసిన అవసరాన్ని, అవకాశాన్ని గుర్తించలేదు. అధికారంలో లేని జాతీయ పెట్టుబడిదారీవర్గపు భాగాలు, పెటీబూర్జువా పార్టీలూ చాల ప్రమాదకరమైనశత్రువులని వారు వాదించారు. 1931 లో జపాన్ మంచూరియాపై దండెత్తుటతో చైనాలోని వర్గాల రాజకీయసంబంధాలలో కొత్తమార్పులు వచ్చాయి. కాని యీ "అతివాద" అవకాశవాదుల వైఖరిలో మాత్రం ఎట్టి మార్పూ రాలేదు. ఈ "అతివాద" అవకాశవాదమే ఆకాలంలో ప్రధాన ప్రమాదంగావుంది. విశాల ప్రజానీకంతో పార్టీ సంబంధాలు నెలకొల్పుకొనకుండానూ, వైరుధ్యములన్నిటినీ విప్లవప్రయోజనాలకు వినియోగించుకొనకుండానూ యీవాదనలు అడ్డుతగిలాయి. 1937 లో జపాన్ వ్యతిరేక ప్రతిఘటనా సంఘటన ఏర్పడినతర్వాత, అంతకుపూర్వం ఛెన్-షో-యూ నాయకత్వాన "అతివాద" అవకాశం ప్రదర్శించిన కార్యక్రమాన్ని తిరిగి మితవాద అవకాశవాద పొరపాటుచేశారు. ఈ దశలో మితవాద అవకాశవాద పొరపాట్లు ప్రధాన ప్రమాదంగా వున్నాయి. వీరు, ఐక్యసంఘటనలోని అభివృద్ధినిరోధక శక్తుల, ధోరణులకు వ్యతిరేకంగా పోరాడకుండా అరికట్టి కార్మికవర్గం తన స్వతంత్రప్రతిపత్తిని కోల్పోయే ప్రమాదాన్ని తెచ్చిపెట్టారు.

జపాన్ వ్యతిరేక ప్రతిఘటనాకాలంలో ఏర్పడిన ఐక్య సంఘటనలో, జంగ్-కై-షేక్ ప్రాతినిధ్యం వహించిన అధికారంలోనున్న కుమింటాంగ్ ముఠా, 10 సంవత్సరాల అంతర్యుద్ధ దశలో కమ్యూనిస్టుపార్టీకి వ్యతిరేకంగా క్రూరమైన దుశ్చర్యలు జరిపిన ఆంగ్లో-అమెరికన్ అనుకూల పెద్ద భూస్వా

ములూ, పెద్ద పెట్టుబడిదార్లుకూడా వున్నారు. ఆ కాలంలో ఈ ముఠాకు పెద్ద సైనికబలాలు వున్నందువల్లనూ, దూర ప్రాచ్యంలో ఆధిపత్యంకోసం అమెరికా, జపాను సామ్రాజ్య వాదులు తగాదాలుపడి యుద్ధం చేస్తున్నందువల్లనూ యీ ముఠాను ఐక్యసంఘటనలోనికి తీసుకొనివచ్చుట అవసరమైంది. ఈ ఐక్యసంఘటన ఏర్పడినతర్వాత కామ్రేడ్ మావో దీనిలో అతివాద, మితవాద మధ్యస్థ గ్రూపు లున్నాయనీ, అతివాద గ్రూపును విస్తృతపర్చి బలవత్తరం చేయాలని, అభ్యుదయ పథంవైపుకు రావలసిందిగా మధ్యస్థులను కోరవలసివుంటుందనీ, మితవాదవర్గమును వేరుపర్చాలని చెప్పారు. "అభివృద్ధికర శక్తులను బలవత్తరంచేసి, మధ్యస్థులను మనవైపుకు త్రిప్పుకొని, కరుడుగట్టిన శక్తులను వేరుచేయాలి" యిదీ విధానం. మితవాద అవకాశవాద పొరపాట్లుచేసిన కామ్రేడ్స్ కామ్రేడ్ మావో యొక్క విధానమును వ్యతిరేకించి, ఐక్యసంఘటనలో వర్గాల విచక్షణనే మర్చిపోయారు. "అతివాద, మధ్యస్థ, మితవాద వర్గాలమధ్య తేడా చూపరాదు" అన్నారు. చైనాలో ఫాసిజమే లేదని వాదించారు. కమ్యూనిస్టు, కుమింటాంగ్ పార్టీల వర్గవ్యత్యాసమునే కాదన్నారు. కామ్యూనిస్టు, కుమింటాంగ్‌పార్టీలు రెండూ "అత్యుత్తమమైన అభివృద్ధికరమైన చైనాయువకుల సంగమములే" అని వర్ణించారు. (1937 లో ఛెన్-షో-యూ వ్రాసినవ్యాసం). ఆచరణలో యీ మితవాద అవకాశవాదం కుమింటాంగ్ అభివృద్ధి నిరోధకుల రక్షణకే పని చేసింది.

మితవాద అవకాశవాదపొరబాటు చేసిన యీ కామ్రేడ్స్, కామ్రేడ్ మావో జపాన్ వ్యతిరేక ప్రతిఘటనా

కాలంలో చేసిన "ఐక్యసంఘటనలో స్వాతంత్రమూ, స్వేచ్ఛా ప్రతిపత్తి" అనే సూత్రాన్ని వ్యతిరేకించారు. అన్నివిషయాలనూ జంగ్-కై-షేక్, కుమింటాంగ్ లే నిర్ణయించాలని వారు వాదించారు. మితవాద అవకాశవాద పొరబాటు చేసిన వీరు మిలిటరీ విషయాల్లో "నాయకత్వాన్ని, నిర్మాణమును, ఆయుధాలను క్రమశిక్షణను, యుద్ధపథకాలు, యుద్ధ చర్యలనూ ఏకీకృతం చేయాలని" వాదించారు. ఇలాగే చేసివున్నట్లయితే, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వానవున్న ప్రజాసైన్యమును కుమింటాంగ్ సైన్యములో విలీనంచేయుట జరిగేది. ఆ సైన్యాన్ని జంగ్-కై-షేక్ తన చిత్తంవచ్చినట్లు స్వాహాచేసేవాడు. సరిగ్గా యిదేవాదనను "సైనిక, రాజకీయ వ్యవస్థలను ఐక్యపర్చుట" అనే విప్లవప్రతీఘాతుక వాదనను, కొంతకాలానంతరం జంగ్-కై-షేక్ కూడా లేవదీశాడు. ఈ కామ్రేడ్స్ "కుమింటాంగ్ ప్రజావ్యతిరేక విధానాలకు మద్దతునిచ్చారు. వీరికి ప్రజలకంటే కుమింటాంగ్ పట్ల ఎక్కువ విశ్వాసంవుంది. ప్రజావుద్యమాలను స్వేచ్ఛగా నడిపే ధైర్యంగాని, జపాన్ ఆక్రమితప్రాంతాల్లో విముక్తిప్రాంతాలను, ప్రజాసైన్యాన్ని బలీయమొనర్చి విస్తృత మొనర్చు ధైర్యంగానీ వీరికిలేదు. జపాన్ వ్యతిరేక యుద్ధనాయకత్వాన్ని కుమింటాంగ్ కు దారాదత్తంచేశారు" అని కామ్రేడ్ మావో అన్నారు.

"ఐక్య సంఘటనలో స్వేచ్ఛ, స్వాతంత్ర ప్రతిపత్తి" అనే సిద్ధాంతమును వర్ణిస్తూ కామ్రేడ్ మావో యిలా అన్నారు: "ఇలా చేయడంలో మన లక్ష్యమేమిటి? మనం యిప్పటికే సంపాదించుకొన్న స్థానాన్ని నిలబెట్టుకోవడం ఒకటి. యీస్థానం మన వ్యూహంలో పునాదిగా వుంటుంది. మనం ఒక్కసారి

దీన్ని కోల్పోయినట్లయితే యిక సాధించేదేమీ వుండదు. 'లక్షలాది ప్రజానీకాన్ని జపాన్ వ్యతిరేక పోరాటంలోనికి సమీకరించి, జపాన్ సామ్రాజ్యవాదమును కూలద్రోసేందుకు' యీ పునాదిని విస్తృత మొనర్చుకొనుట మరింత ముఖ్యమైనది."

కామ్రేడ్ మావో ప్రతిపాదించిన, రాజకీయ, సైనిక తంత్ర సిద్ధాంతములు, వాటి కనుగుణ్యంగా రూపొందించబడిన విధానములద్వారా, జపాన్ వ్యతిరేక యుద్ధములో ప్రజానీకము నకు లాభసాటిగా నుండునట్టి విజయమును సాధించుట సాధ్యమైంది. అట్టి మహత్తర విజయమును సాధించుటలో యీ సూత్రములు, విధానాలూ ప్రముఖపాత్ర వహించాయి.

ఏది ఏమైనప్పటికీ, మితవాద అవకాశవాదాల వైఖరి వల్ల, మన స్థావరాలు పోగొట్టుకోవడం జరిగింది. అందువల్ల వాటిని విస్తృతపర్చు సమస్యలేదు. కాబట్టి మితవాద అవకాశవాదులు చేసిన కొన్ని తప్పుల పర్యవసానం మాత్రం కామ్రేడ్ మావో సూచించిన విధానానికే వ్యతిరేకంగా నున్నది. కామ్రేడ్ ఛెన్‌షో-యూ ఆ కాలంలో వ్రాసిన వ్యాసంలో, ప్రతిఘటనా యుద్ధముయొక్క గమనమును యిలా వర్ణించాడు: "చైనాలో వాస్తవ పరిస్థితి యిలా వుంది. కమ్యూనిస్టు, కుమింటాంగ్ పార్టీలు రెండూ సహకరించు కుంటూ, జపాన్ దురాక్రమణదారులను తరిమివేసి విజయాన్ని సాధించినట్లయితే, కుమింటాంగ్ పార్టీ చైనా ప్రజల జాతీయ ప్రయోజనాలకై పోరాడే రాజకీయ పార్టీగానూ, ప్రతిఘటనా యుద్ధమును అచంచలంగా నడిపిన జంగ్-కై-షేక్, యితర నాయకులూ చైనా జాతీయ వీరులుగా ఆచంద్ర

తారార్కం వెలుగొందుతారు. అట్టి మహద్భాగ్య మబ్బే సుదినం వచ్చినపుడు, చైనా ప్రజల అభీష్టాలకు వ్యతిరేకంగా, కుమింటాంగు పాలనను కూలద్రోయడానికి ఎవరికి ధైర్య ముంటుంది?" "కాబట్టి ప్రతిఘటనా యుద్ధము విజయవంతమైన వెనుక, చైనా కమ్యూనిస్టులకు చెందుతుంది అనే గాలివార్తను విశ్వసించేవారికి, చైనాలోనున్న వాస్తవ పరిస్థితులను గురించి ఏమీ తెలియదనీ, కుమింటాంగ్ పార్టీ యొక్క పోరాట పటిమ లోనూ, మహోన్నత భవిష్యత్తులోనూ ఎట్టి విశ్వాసమూ లేదనీ అనుకోవలసి వస్తుంది. ఇది చాలా ప్రమాదకరమైనది." ఈ వాదనయొక్క సారాంశ మేమిటంటే, ప్రతిఘటనా యుద్ధం విజయవంతమైన వెనుక చైనాదేశం కుమింటాంగ్ అభివృద్ధి నిరోధక పాలనలో వుండాల్సిందేగాని, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం వహించే నూత్న ప్రజాస్వామిక దేశంగా మాత్రం వుండదు. ఆ కాలంలో మితవాదఅవకాశవాదుల వైఖరి యొక్క సహజమైన పర్యవసానం యిదే ఇది, చైనా ప్రజల యొక్క పోరాట పటిమను, మహోన్నత భవిష్యత్తుకూ చాలా హానికరమగు నిర్ణయం. చైనా ప్రజాశక్తి ఈజోశ్యాన్ని తుత్తు నియలు చేసింది. కామ్రేడ్ ఛెన్-షో-యూ మహావీరుడని వర్ణించిన జంగ్-కై-షేక్ "చస్తే పీడ విరగడై పోతుందని చైనాలోని ప్రతివారూ ఆశిస్తున్నారు." చైనాప్రజలు పురో గమించవలసిన మార్గమును చూపుతూ, వారితోబాటు వుంటూన్న అసంఖ్యాక కమ్యూనిస్టుపార్టీసభ్యులూ, ప్రజాసైని కులు నిజమైన వీరులుగా చిరస్థాయిగా వర్ధిల్లుతున్నారు. ఆవిధంగా, చైనాలోని వాస్తవిక పరిస్థితులతో సంబంధం లేకుండా అజ్ఞానంలో నున్నవారు యీ మితవాద అవకాశ

వాదులే. జంగ్-కై-షేక్ ఏమిచేస్తున్నా పట్టించుకోకుండా, మనం మాత్రం త్యాగంచేసికూడా కుమింటాంగ్‌తో ఐక్యత నిలబెట్టుకోవాలని యీ మితవాద అవకాశవాద మిత్రులు వాదించారు. ఇది పూర్తిగా పొరబాటు. యీ అవకాశవాద మిత్రుల వాదనను ప్రత్యామ్నాయంగా కామ్రేడ్ మావో సరైనబాటను సూచించారు. జపాన్ వ్యతిరేకశక్తుల నన్నింటిని ఐక్యపర్చుటకుగాను సుదృఢమైన పోరాటం సాగించాలని కామ్రేడ్ మావో తెలియజేశాడు. "జపాన్ వ్యతిరేక ప్రతిఘటనా పోరాటకాలంలో, మిత్రత్వాన్ని సాధించేదానికి పోరాటాలు మార్గం. పోరాటాలకు లక్ష్యం మిత్రత్వసాధనగానూ వుంటుంది. పోరాటాలద్వారా సాధిస్తే ఐక్యత నాల్గు కాలాలపాటు వుంటుంది. ఆశలుచూపి, సాధిస్తే ఐక్యత అంతరిస్తుంది."

జపాన్ వ్యతిరేక ప్రతిఘటనాకాలంలో దేశమంతటా జరిగిన ఘటనలన్నీ కామ్రేడ్ మావో చెప్పిన వాస్తవాన్నే బలపర్చాయి. కుమింటాంగ్ బడాపెట్టుబడిదారీవర్గము ఒకవైపు జపాన్‌ను ప్రతిఘటిస్తూనే, లొంటుబాటుకు సిద్ధమయ్యేది. కమ్యూనిస్టుపార్టీతో కలుస్తూనే కమ్యూనిస్టుపార్టీని ప్రతిఘటించడానికి పూనుకునేది. అందుచేత యీవర్గపు ద్వంద్వ స్వభావమున కనుగుణ్యంగానే, ఐక్యమౌతూనే పోరాటం సాగించాలి అనే విప్లవవిధానాన్ని చేబట్టడం జరిగింది. ఈ విధానానుగుణ్యంగానే మన పార్టీ, విశాల ప్రజాబాహుళ్యమును నిరంతరమూ సమీకరిస్తూ, జపాన్ వ్యతిరేకశక్తుల నన్నింటినీ ఐక్యపరుస్తూ, కరుడుగట్టిన ముఠాను వేరుచేసింది. జంగ్-కై-షేక్ సాగించిన కమ్యూనిస్టు వ్యతిరేకదండయాత్రల

న్నింటినీ త్రిప్పికొట్టింది. తద్వారా, ఆఖరువరకు ప్రతిఘటనా యుద్ధాన్ని కొనసాగించి, జపాన్ వ్యతిరేక ఐక్యసంఘటనను నిలబెట్టగలిగింది.

ప్రతిఘటనాకాలంలో, కుమింటాంగ్‌తో మనం ఏర్పర్చిన ఐక్యసంఘటనకు సాయుధప్రజాశక్తులే ప్రాతిపదిక అనే విషయాన్ని మితవాద అవకాశవాదులు అర్థంచేసుకోలేకపోయారు. జంగ్-కై-షేక్ బలవంతానగాని ఐక్యసంఘటనలో చేరలేదు. సాయుధప్రజాశక్తులే లేకున్నట్లయితే జంగ్-కై-షేక్ ససేమిరా మనతో ఐక్యసంఘటనకు సిద్ధపడేవాడుగాదు. ఐక్యసంఘటనలో చేరినతర్వాత కూడా, తన విప్లవప్రతీఘాతుక శక్తుల సహాయంతో, మనను దెబ్బకొట్టడానికీ, మననూ, సాయుధ ప్రజాశక్తులనూ వేరుచేయడానికి నిరంతరం ప్రయత్నిస్తూనేవున్నాడు. అందువల్లనే మనం, సాయుధ ప్రజాశక్తులపై ఆధారపడి, విప్లవ ప్రతీఘాతుక కొమింటాంగ్‌తో కొన్ని హద్దులలో, సక్రమమైన వుపయోగకరమైన పోరాటం సాగించవలసివచ్చింది. ఈ ప్రధానవిషయాలు రెండింటిలోనూ, మితవాద అవకాశవాదులు చేస్తున్న తప్పులను కామ్రేడ్ మావో విమర్శించారు. జపాన్ వ్యతిరేక ఐక్యత ప్రధానంగా సాయుధసైన్యాల ఐక్యతయనీ, ఐక్యసంఘటనలో పోరాటం తప్పనిసరియనీ కామ్రేడ్ మావో చెప్పారు. జంగ్-కై-షేక్ గనుక జపాన్‌దురాక్రమణదారులతో షరీకై సాయుధప్రజాశక్తులపైనా, జపాన్ వ్యతిరేకస్థావరాలపైనా దాడి ప్రారంభించినట్లయితే మనం చూస్తూ వూరుకోరాదు. న్యాయమైన, అవుసరమైన పోరాటాన్ని ఆత్మరక్షణకోసం, వుపయోగపడేలాగా నిగ్రహంతో సాగించాలి. వాస్తవంగా, జంగ్-కై-షేక్ జపాన్ సామ్రాజ్య

వాదులతో కలిసి మూడు పర్యాయములు కమ్యూనిస్టులపై దాడిచేశాడు. ఇట్టి విప్లవ ప్రతిఘాతుకదాడులను జూచి కమ్యూనిస్టుపార్టీ భీతిచెందలేదు. వాటిని తిరగగొట్టి, సాయుధ ప్రజాశక్తులను, జపాన్ వ్యతిరేకస్థావరాలను సంరక్షించి, ప్రతిఘటనా యుద్ధంలో విజయం సాధించింది.

జపాన్ వ్యతిరేక ఐక్యసంఘటనలో, కరుడుగట్టిన కొమింటాంగ్ ముఠాను వ్యతిరేకంగా పోరాడితే ఐక్యసంఘటన బద్దలైపోతుందని మితవాద అవకాశవాదులువాదిస్తూవచ్చారు. మరోవైపు "అతివాద" అవకాశవాదులు, హద్దులులేని పోరాటము కొనసాగించాలని చెప్పుతూ, మధ్యస్థ శక్తులపట్ల కూడా తప్పు వైఖరి అవలంభిస్తున్నామని వాదిస్తూవచ్చారు. కామ్రేడ్ మావో యీ అతివాద, మితవాద అవకాశవాదుల నిద్దరినీ నిశితంగా విమర్శించారు. ఆ కాలంలో "అతివాద" అవకాశవాద పొరపాటు జరగకుండా చూచుటకై కొమింటాంగ్ ముఠాను వ్యతిరేకంగా జరిగే పోరాటంలో మూడు విఖ్యాత సూత్రీకరణలు చేశారు. "సమర్థనీయమైన" "లాభసాటియైన" "నిగ్రహంతో కూడుకున్న" పోరాటం సాగించాలి, అనేవే సూత్రాలు. తగినదశ రాగానే ఆగిపోయేయుద్ధమే నిగ్రహంతో కూడుకున్న యుద్ధమని అర్థం. కామ్రేడ్ మావో యిలా అన్నాడు: "సమర్థనీయమైన, లాభసాటియైన నిగ్రహంతో కూడుకున్న పోరాటం కొనసాగించుటద్వారా, అభివృద్ధికరశక్తులను మనవైపుకు త్రిప్పుకొని, కరుడుగట్టినశక్తులను వేరుచేయగలం. తద్వారా, కరుడుగట్టినశక్తులు కళ్లుమూసుకొనిమనపై విరుచుకుపడకుండాను, శత్రువుతో చేతులుకలుపకుండాను, పెద్దయెత్తున అంతర్యుద్ధాన్ని ప్రారంభించకుండాను భీతిల్లేలాచేస్తాం."

పెట్టుబడిదారీ వర్గంలోని అభివృద్ధి నిరోధకులతో ఐక్య మౌతూనే ఐక్యసంఘటనలో వారికి వ్యతిరేకంగా పోరాటం సాగించాలి. ఇలా చేస్తేనే "జాతీయ పోరాటాన్ని వర్గ పోరాటంలో సమన్వయ పర్చగలం" అని కామ్రేడ్ మావో విశదీకరించారు. కామ్రేడ్ మావో విజయవంతంగా ఆచరించిన విప్లవకళ యిది. కామ్రేడ్ మావో చెప్పినట్లు ఐక్యత, పోరాటం అనేసూత్రాలు అనుసరించినందువల్ల కరుడుగట్టిన శక్తులు చాలామేరకు వేరైనాయి మధ్యస్థ శక్తులను మనవైపుకు త్రిప్పుకోగలిగాం. అభ్యుదయశక్తులను అభివృద్ధి పరుచుకున్నాం. కమ్యూనిస్టుపార్టీని, ప్రజలనూ, సిద్ధాంతరీత్యా, రాజకీయంగా, నిర్మాణరీత్యా, సైనికరీత్యా పూర్తిగా సన్నద్ధం చేసుకోగలిగాము. తత్ఫలితంగా జపాన్ లొంగిపోయినవెనుక చైనా ప్రజలపై అమెరికన్ సామ్రాజ్యవాదమూ దానివిశ్వాసపాత్రుడైన బంటు జంగ్-కై-షేక్ సాగించిన విప్లవప్రతీఘాతుక యుద్ధాన్ని రెండు మూడేండ్లలోనే నాశనం చేయడానికై కమ్యూనిస్టుపార్టీ ప్రజలకు నాయకత్వం వహించ గలిగింది. చైనాలోని ఆఖరువిప్లవ ప్రతీఘాతుక వంశాన్ని కూలద్రోసి ఒకశతాబ్దంగా చైనాప్రజలు కష్టాలకోర్చి కృషిచేసిన విప్లవ విజయాన్ని సాధించాము.

ప్రతిఘటనా యుద్ధకాలంలో యిటు కార్మికులు, రైతులు, యితర పెటీబూర్జువాశక్తులకూ, అటు బడాభూస్వాములు, పెద్దపెట్టుబడిదార్లకూ మధ్య జాతీయ పెట్టుబడిదారీ వర్గము, మధ్యతరగతులూ ఒక మధ్యస్థశక్తిగా నున్నారు. ఈ మధ్యస్థవర్గాన్ని తనవైపుకు త్రిప్పుకునే విధానాన్ని కమ్యూనిస్టుపార్టీ ఆచరించింది. కామ్రేడ్ మావో యిలా వివరించారు:

"యీవర్గానికీ, కార్మికవర్గానికి వర్గవైరుధ్యాలున్నా కార్మికవర్గపు స్వతంత్రతను యిది ఆమోదించదు. శత్రువు ఆక్రమిత ప్రాంతాల్లో జపాన్ సామ్రాజ్యవాదము యీవర్గమును పీడిస్తున్నందువల్లనూ, కుమింటాంగ్ పాలనలో భూస్వామ్య వర్గము పెద్ద పెట్టుబడిదార్లూ యీ వర్గమును అరికడుతున్నందువల్లనూ, యీవర్గము జపాన్‌ను ప్రతిఘటించాలనీ రాజకీయాధికారాన్ని తానే పొందాలనీ వాంఛిస్తున్నది. జపాన్‌కు వ్యతిరేకంగా ప్రతిఘటన సాగించాలని వాంఛిస్తుంది. రాజకీయాధికారం సమస్య వచ్చినపుడు చట్టబద్ధ ప్రభుత్వ స్థాపనకై సాగే వుద్యమాన్ని బలపరుస్తుంది. అభ్యుదయకాముకులకు కరుడు గట్టిన అభివృద్ధినిరోధకులకు మధ్యనున్న వైరుధ్యాల నుపయోగించుకొనుటద్వారా తనలక్ష్యాన్ని సాధించాలని ప్రయత్నిస్తుంది. యీ వర్గాన్ని మనవైపుకు త్రిప్పుకోవాలి."

జాతీయ పెట్టుబడిదారీ వర్గపు విప్లవభావాలతో సమైక్యత సాధిస్తూనే, దాని వూగిసలాడే, రాజీతత్వాన్ని విమర్శించుటగూడా జరిగింది. విమర్శనాపద్ధతి పోరాటరూపాల్లో ఒకటి. విమర్శించే యీ పోరాటరూపానికీ, కుమింటాంగ్ అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా జరిగే పోరాట రూపానికీ తేడా వుంది. జాతీయపెట్టుబడిదారీవర్గం అధికారంలో లేకపోవుటయే యీ వ్యత్యాసానికి మూలం. అదికూడా, ఐక్యత పోరాటముల యొక్క సమ్మిళిత విధానపు రూపమే. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో, జాతీయ పెట్టుబడిదారీవర్గపు వైఖరిని దృఢపర్చుటయే యీ విధానపు లక్ష్యం.

ప్రతిఘటనా యుద్ధం అంతమైన తర్వాత కూడా జంగ్-కై-షేక్ ప్రాతినిధ్యం వహిస్తున్న బడాభూస్వాముల, నిరంకుశ

పెట్టుబడిదార్ల (పెద్దపెట్టుబడిదార్ల) పీడనకూ, ఆటంకాలకూ జాతీయ పెట్టుబడిదారీవర్గం గురియౌతూనే వచ్చింది. జపాన్ పీడన పోయింది అనుకుంటే ఆస్థానంలో అమెరికా పీడన ప్రారంభమైంది. ఇదికూడా జాతీయ పెట్టుబడిదార్ల ప్రయోజనాలకు హానికరమైనదే. అందువల్ల జాతీయ పెట్టుబడిదారీ వర్గము, కార్మికవర్గముల ఐక్యసంఘటన కొనసాగే అవకాశం వచ్చింది. ఆ వర్గపు విప్లవభావాలలో సమైక్యత, దాని వూగిసలాడే రాజీ స్వభావానికి వ్యతిరేకంగా విమర్శనా పోరాటం కొనసాగించుట అనేదే మన విధానంగా వుండిపోయింది.

చైనా ఆర్థికవ్యవస్థ వెనుకబడివున్నందువల్ల, విప్లవానంతరంకూడా జాతీయ పెట్టుబడిదారీవర్గంలో ఆర్థికరంగంలో ఐక్యసంఘటన కొనసాగించవలసిన అవసరం వుంటుందని కామ్రేడ్ మావో విస్పష్టం చేశారు.

ఆర్థికరంగంలో ఐక్యసంఘటనకూడా ఐక్యత, పోరాటం అనే విధానానుగుణ్యంగానే వుండాలని కామ్రేడ్ మావో వివరించినారు. పారిశ్రామికోత్పత్తిని పెంపొందించుటపట్ల పెట్టుబడిదార్లకుగల వుత్సాహంతో ఐక్యం గావాలి. పెట్టుబడిదారీవర్గపు చట్టా వ్యాపారాన్నీ, కుయుక్తులూ, గుత్తవిధానంతోనూ, ప్రభుత్వ చట్టాలను, నిబంధనలను, ఆర్థిక ప్రణాళికలను అతిక్రమించే విధానంతోనూ పోరాటం సాగించాలి.

గత కొద్దిసంవత్సరాల ఘటనలూ కామ్రేడ్ మావో యొక్క విధానం సరియైనదని నిరూపించాయి. "సామ్రాజ్యవాద వత్తిడిని తట్టకోడానికీ, వెనుకబడిన తన ఆర్థిక వ్యవస్థను ఒకడుగు ముందుకు వేయించడానికీ, జాతీయార్థిక విధానము,

ప్రజల జీవితాలకు లాభదాయకమగునట్టి, హానికరముగానట్టివన్నీ గ్రామీణ పట్టణ పెట్టుబడిదారీ శక్తులన్నింటినీ వుపయోగించుకోవాలి. ఉమ్మడి పోరాటంలో జాతీయ పెట్టుబడిదార్లతో ఐక్యంగావాలి" చైనా ప్రజారిపబ్లిక్ వివిధరంగాలలో సాధించిన విజయాలు యీ విధానం సరైనదని నిరూపిస్తున్నవి. అమెరికా దురాక్రమణ ప్రతిఘటనోద్యమము, కొరియా సహాయోద్యమము విప్లవ ప్రతీఘాతకుల నిర్మూలనోద్యమమూ వ్యవసాయ సంస్కరణ ఉద్యమమువంటి బ్రహ్మాండమైన ప్రజోద్యమాల్లో సైతం యీ వాస్తవమే రుజువగుచున్నది.

మితవాద అవకాశవాదులు, ఐక్యసంఘటనలో కార్మిక వర్గపు స్వేచ్ఛను, స్వతంత్ర ప్రతిపత్తిని, నాయకత్వ పాత్రను వదలి వేయడానికి ప్రయత్నించారు. తద్వారా ప్రజల విజయాన్నే తప్పనిసరిగా త్యాగంచేయ సమకట్టారు. ఇందువల్ల, వారి విధానాలు లోపభూయిష్టమైనవని గత కొద్ది సంవత్సరాల ఘటనలన్నీ నిరూపిస్తున్నాయి. అలాగే "అతివాద" అవకాశవాదులు, విప్లవ శత్రువులను చాలామేరకు వేరుచేయుట అవసరమూ, దానికి కావలసిన అవకాశమూ వున్నప్పుడు కూడా, మనలను యితరులనుండి వేరుపర్చి శత్రువుకే లాభదాయకంగా పనిచేస్తున్నారు. అందువల్లనే, "అతివాద" అవకాశవాదుల విధానాలు కూడా లోపభూయిష్టమైనవని గత కొద్ది సంవత్సరాల ఘటనలన్నీ నిరూపించాయి.

# ప్రజాస్వామిక విప్లవంనుండి సోషలిస్టు విప్లవంలోకి మార్పుచెందుటలో ఏర్పడు సమస్యలు

"మిశ్రమప్రభుత్వం" అనే తన పుస్తకంలో కామ్రేడ్ మావో యిలా వ్రాశారు: "కమ్యూనిస్టులం రాజకీయపంథాను ఎప్పుడూ దాచుకోం. చైనాను సోషలిజం, కమ్యూనిజముల వైపు పురోగమింపజేయుటయే మన భవిష్యత్కార్యక్రమ మనేది నిస్సందేహం మన పార్టీయొక్క పేరు, మార్క్సిస్టు ప్రపంచదృక్పథమూకూడా శోభాయమానమైన అత్యంత రామ ణీయకమైన మన మహోన్నత లక్ష్యాన్నే సూచిస్తున్నాయి. పార్టీలోచేరిన తర్వాత మనలో ప్రతివారూ రెండులక్ష్యాలను దృష్టిలోపెట్టుకుని వున్నారు. ప్రస్తుత నూత్న పెట్టుబడిదారీ ప్రజాతంత్ర విప్లవము, భవిష్యత్తులోని సోషలిస్టు, కార్మిక విప్లవ సాధనకూ పోరాటం సాగించుటయే మనలక్ష్యాలు. కమ్యూనిజంయొక్క శత్రువులు మూఢత్వంతోనూ, నీచత్వం తోనూ మనపై శత్రుత్వం వహించి, అవనిందలువేసి, వేళా కోళం చేసినప్పటికీ మనం యీరెండులక్ష్యాలనూ నిర్భయంగా కొనసాగిస్తున్నాం. ఇట్టిదాడులనన్నింటినీ మనం నిబ్బరంగా త్రిప్పి కొట్టాలి. సదుద్దేశంగల విమర్శకులను మాత్రం ప్రతిఘటించ రాదు. వారికి సదుద్దేశంతోనే, ఓర్పుతో వివరించాలి. దీనిలో చిక్కులుగాని శ్లేషలుగానిలేవు. ఇది చాలా స్పష్టంగావుంది."

పైనపేర్కొన్న భాగం చైనాయొక్క భవిష్యత్తును గురించి తేటతెల్లంచేస్తున్నది. ఇది తథ్యం. ప్రపంచ చరిత్రనూ, చైనా చరిత్రనూ పఠించుచున్న సూత్రాలే దీనికి మూలం.

మితవాద అవకాశవాదులు యీ భవిష్యత్తును చూడ లేక పోవడమో, యీ భవిష్యత్తు చాలా అనిశ్చయమనీ, ఆశలు అంతగాలేవనీ భావించడమో జరిగింది. పెట్టుబడిదారీ ప్రజా తంత్ర విప్లవానికి పెట్టుబడిదారీ వర్గమే నాయకత్వం వహిస్తుం దని వారన్నారంటే దాని అర్థం విప్లవఫలం దానికేదక్కాలని. 1923 లో తాను వ్రాసిన "పెట్టుబడిదారీ విప్లవమూ, విప్లవ పెట్టుబడిదారీ వర్గము" అనే వ్యాసంలో ఛెన్-టూ - షీ యిలా వ్రాశాడు: "అట్టి ప్రజాతంత్రవిప్లవం విజయమొందడ మంటే అది పెట్టుబడిదార్ల విజయమే." ఈయన మితవాద వైఖరినుండి, సోషలిస్టు భవిష్యత్తునే నిరాకరించాడు. దీనికి ప్రతిగా "అతివాద" అవకాశవాదులు, పెట్టుబడిదారీ ప్రజా తంత్ర విప్లవానికీ సోషలిస్టు విప్లవానికీ గల తేడాను చూడ లేకపోయారు. కొన్ని రాష్ట్రాల్లో విప్లవం ప్రారంభవిజయాలు సాధించగానే సోషలిజమును సాధించుమార్గమున పరిణామం చెందుతుందనీ వాదించారు. చైనాయొక్క "ముఖ్యభాగాలకు" విప్లవవిజయం వ్యాపించు సమయమునకు సోషలిస్టు విప్లవ మును కొనసాగించుటయే ప్రధాన కర్తవ్యంగావుంటుంది. సోషలిజమును సాధించు పునాదిపైననే, కుమింటాంగ్ అభివృద్ధి నిరోధకుల, సామ్రాజ్యవాదుల పాలనను కూలద్రోయుట సాధ్యమగును." ఈవిధంగా "అతివాదులు" ప్రజాతంత్ర విప్లవ విజయావకాశాన్నే నిరాకరించారు. తద్వారా, వాస్తవంగా సోషలిస్టు విప్లవ విజయావకాశాలనే నిరాకరించారు.

అనేక యితరవిషయాలలోవలెనే, యీ విషయంలో కూడా "అతివాద, మితవాద అవకాశవాదాలు" రెండూ, ఒకదాని కొకటి అనుబంధించబడినవే. జపాన్ వ్యతిరేక ప్రతి

ఘటనా పోరాటపు మొదటిరోజులలో, కామ్రేడ్ మావో నాయకత్వాన మనపార్టీ, యీ ప్రతిఘటనోద్యమపు ఫలితాన్ని ప్రజల విజయంగా మార్చడానికి ప్రతినిత్యమూ కృషి చేసింది. కాని రెండవవిప్లవపు అంతర్యుద్ధకాలంలో "అతివాద" పొరపాటుచేసిన కామ్రేడ్స్, జపాన్ వ్యతిరేక ప్రతిఘటనాయుద్ధం వచ్చేటప్పటికి, ఆ యుద్ధఫలితం జంగ్-కై-షేక్‌కు అనుకూలంగా వుంటుందని భావించారు. ఈ నిర్ణయంమూలంగా, ప్రజాతంత్ర విప్లవంయొక్క విజయాంతమునుగాని, సోషలిస్టు విప్లవ భవిష్యత్తును గాని వీరు గుర్తించలేరు.

1927 తర్వాత కామ్రేడ్ మావో నిరంతరమూ, విప్లవ స్వభావానికి సంబంధించిన సమస్యల్లో సంభవించే లోపభూయిష్టమైన "అతివాద" సిద్ధాంతమును ఖండిస్తూనే వచ్చాడు. చైనా ప్రజాతంత్ర విప్లవం ఆఖరువరకూ కొనసాగించాలని కామ్రేడ్ మావో పరిగణిస్తూ వచ్చాడు. "ఇలా వ్యవహరించడంద్వారానే చైనా విప్లవపు సోషలిస్టు భవిష్యత్తును మనం పెంచి పోషించగలం. ప్రజల హక్కులకై జరిగే విప్లవదశనుగాని, చైనా విప్లవం సోషలిస్టు విప్లవంగా పరిణామం చెందే సమయం ఆసన్నమైనదనిగాని అపోహపడుట చైనావిప్లవానికి చాల హానికరం." చైనా విప్లవ స్వభావం యింకనూ పెట్టుబడిదారీ ప్రజాతంత్ర విప్లవంగానే వున్నదని ఆనాడు అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ చెప్పింది. ఇది పూర్తిగా సరియైనదని కామ్రేడ్ మావో పరిగణించారు. "అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ వెలిబుచ్చిన అభిప్రాయం సరియైనదేనని మనం యింత వరకు జరిపిన పోరాటమే రుజువు చేస్తున్నది."

పెట్టుబడిదారీ ప్రజాస్వామిక విప్లవమునుండి సోషలిస్టు విప్లవమునకు పరిణామం చెందు క్రమమును గురించి కామ్రేడ్ లెనిన్, స్టాలిన్‌లు చేసిన సూత్రీకరణలను, చైనాలోని వాస్తవ పరిస్థితుల కన్వయించి, కామ్రేడ్ మావో అభివృద్ధి చేశారు. కామ్రేడ్ మావో యిలా అన్నారు: "విప్లవాల పరిణామ సిద్ధాంతమును మనం ప్రచారం చేస్తాం గాని ట్రాట్స్కీయొక్క శాశ్వత విప్లవ సిద్ధాంతాన్ని మనం అంగీకరించం. ప్రజాతంత్ర రిపబ్లిక్ యొక్క అవసరమైన దశలన్నింటిద్వారా సోషలిజమును సాధించుటయే మన లక్ష్యం. మనం తోకబుచ్చుకుపోయే విధానానికి వ్యతిరేకులం. అల్లే దుందుడుకుతనానికీ, ఓర్మి రాహిత్యానికీకూడా వ్యతిరేకులమే.

చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం వహించి నడుపుతున్న విప్లవోద్యమంలో ప్రజాతంత్ర, సోషలిస్టు విప్లవదశలు రెండిటితోకూడిన పరిపూర్ణ విప్లవమేనని కమ్యూనిస్టులందరూ తెలుసుకోవాలి. ఈ రెండూ, స్వభావంలో వ్యత్యాసంగలవైనా, రెండు విప్లవక్రమములు. ప్రజాతంత్రదశ పూర్తియైన వెనుకనే సోషలిస్టుదశను చేరుకోవడం సాధ్యం. సోషలిస్టు విప్లవానికి కావలసిన సన్నద్ధతయే ప్రజాతంత్రవిప్లవం. ప్రజాతంత్ర విప్లవంలో తప్పనిసరిగావుండే ధోరణియే సోషలిస్టువిప్లవం. సోషలిస్టుసమాజాన్ని, కమ్యూనిస్టు సమాజాన్ని సాధించుటయే కమ్యూనిస్టుల అంతిమాశయం. ప్రజాతంత్రవిప్లవానికీ, సోషలిస్టు విప్లవానికీ గల సంబంధాలనూ, తేడాలను గురించి స్పష్టమైన అవగాహన వున్నప్పుడే, మనం చైనావిప్లవానికి సరైన నాయకత్వాన్ని సమకూర్చగలం."

యావత్తు విప్లవోద్యమాభివృద్ధినీ చూచినట్లయితే "నూతన ప్రజాతంత్ర విప్లవదశ "వలస, అర్ధవలస, అర్ధ భూస్వామ్య సాంఘికవ్యవస్థ అంతంగావడానికీ, సోషలిస్టు సాంఘికవ్యవస్థ ప్రారంభంగావడానికీ మధ్య పరిణామదశగా వుంటుంది" అని తేలుతుంది.

ఇట్టి పరిణామం, మార్పు ఎందుకుసాధ్యమైంది ? వర్గ దృక్పథమునుండి దీన్ని చూచినట్లయితే, కార్మికవర్గం దీనికి నాయకత్వం వహించింది గాబట్టేన్నీ, పార్టీదృక్పథమునుండి చూచినట్లయితే, కమ్యూనిస్టుపార్టీ దీనికి నాయకత్వం వహించిందిగాబట్టే యిది సాధ్యమైంది. కామ్రేడ్ మావో యిలా స్పష్టీకరించారు: "చైనాలో కమ్యూనిస్టుపార్టీ తప్ప మరే యితర పెట్టుబడిదారీ, పెటీబూర్జువాపార్టీలూ, చైనాయొక్క ప్రజాతంత్ర సోషలిస్టు మహావిప్లవాలను రెండింటినీ, అంతిమ విజయంవరకూ తీసుకొనిపోగల కర్తవ్యమును నిర్వహించ లేవు. చైనాకమ్యూనిస్టుపార్టీ పుట్టిన నాటినుండీ యీ ద్విముఖ కర్తవ్యాలను తన భుజస్కంధాలపైననే వేసుకొన్నది."

పైనచెప్పినట్లుగానే ప్రజాతంత్ర విప్లవదశనూ, సోషలిస్టు విప్లవదశనూ మిళితంచేయుట పూర్తిగా పొరబాటు. అంటే దీని అర్థం ప్రజాతంత్ర విప్లవంలో సోషలిస్టు చిహ్నాలు (Factors) ఏమీ వుండవనిగాదు. అలా భావించడం పూర్తిగా తప్పు ప్రజాతంత్ర విప్లవపు పర్యవసానం గురించి కామ్రేడ్ మావో 1939 లో వ్రాస్తూ యిలా అన్నారు. "ఆర్థికంగా వెనుకబడిన చైనాలో ప్రజాతంత్ర విప్లవవిజయ పర్యవసానంగా కొంతమేరకు పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి యగుట తప్పని సరి. కాని చైనావిప్లవపు ఫలితంలో యిది ఒక్కభాగం

మాత్రమే. చైనావిప్లవపు పర్యవసానంగా ఒకవైపున పెట్టుబడి దారీ లక్షణాలు రెండోవైపున సోషలిస్టు లక్షణాలు అభివృద్ధి అవుతూనే వుంటాయి. ఇది పూర్తిచిత్రం."

కార్మికవర్గ నాయకత్వమనే ప్రాథమిక దృక్పథము నుండియే కామ్రేడ్ మావో యీ నిర్ణయానికి వచ్చారు. మన నూత్న ప్రజాతంత్ర విప్లవ విజయానంతరం జరిగిన ఆర్థిక, రాజకీయ అభివృద్ధి కామ్రేడ్ మావో చేసిన యీ మార్క్సిస్టు-లెనినిస్టు నిర్వచనాన్ని పూర్తిగా ధృవపర్చింది..

నూత్న ప్రజాతంత్ర విప్లవవిజయ పర్యవసానంగా రాజకీయ రంగంలో వచ్చే సోషలిస్టులక్షణాలేవి? ప్రభుత్వాధికారములోని శాఖలలోనూ, సాయుధ ప్రజాసైన్యములలోను కార్మికవర్గం నాయకత్వం వహించుటయే చైనా ప్రజాసమాలోచనాసమితి యొక్క 'ఉమ్మడి కార్యక్రమం'లో యిది నిర్వచించబడింది.

నూత్న ప్రజాతంత్ర విప్లవవిజయ పర్యవసానంగా ఆర్థిక రంగంలో అభివృద్ధియగు సోషలిస్టు లక్షణాలేవి? సామ్రాజ్యవాదులు, నిరంకుశ పెట్టుబడిదార్ల క్రిందనున్న పారిశ్రామిక సంస్థలనన్నింటినీ వశపర్చుకొని వాటి యాజమాన్యమును కార్మికవర్గంచే నడుపబడుతున్న ప్రజా రిపబ్లిక్‌కు సంక్రమింప చేయుటయే యీ మార్పుకు చిహ్నం. ఇందువల్ల "దేశీయార్థిక విధానపు జీవనాడిపై ప్రజారిపబ్లిక్ యొక్క పట్టు ఏర్పడ్డానికీ, యావత్తు ప్రజా ఆర్థికవిధానాల నడిపించుశక్తిగా దీన్ని మార్చుటకు అవకాశమేర్పడుతుంది." ఆర్థికవిధానంలోని యీ భాగపు స్వభావము సోషలిస్టు స్వభావమేగాని పెట్టుబడిదారీ స్వభావంగలదిగాదు." కామ్రేడ్ మావో బోధనల ననుసరించి

'ఉమ్మడి కార్యక్రమం' దీన్ని స్పష్టంగానే సూచించింది. ఉమ్మడి కార్యక్రమంలో యిలావుంది: "ప్రభుత్వ యాజమాన్యాన వున్న ఆర్థికవిధానం, సోషలిస్టు స్వభావంగలది. దేశీయార్థిక విధానానికి సంబంధించివుండి, ప్రజల జీవనవిధానంపై ప్రభావం గల్గియున్న సంస్థలన్నీ ప్రభుత్వపు కేంద్రీకృత పెత్తనంక్రిందనే వుంటాయి. ప్రభుత్వ యాజమాన్యానవున్న సంస్థలూ, నిధి నిక్షేపాలు ప్రజలందరియొక్క ఆస్తియే. వాటిపైన ఆధార పడియే, ప్రజాతంత్ర రిపబ్లిక్, వుత్పత్తిని అధికంచేసి, ఆర్థిక సౌభాగ్యాన్ని సాధిస్తుంది. ఇవి, యావత్తు సాంఘిక, ఆర్థిక విధానపు పురోగామి శక్తులుగావుంటాయి."

నూత్నప్రజాతంత్ర విప్లవకాలంలో అభివృద్ధిచేయబడిన, పరస్పరసహాయకదళాలు, వ్యవసాయోత్పత్తిదార్ల సహకార సంఘాలు, గ్రామీకరైతాంగపు సరఫరా, విక్రయసహకార సంఘాలలో సోషలిస్టులక్షణాలు వున్నాయి. సోషలిజానికి పరిణామంచెందుటలో యివి పరిణామరూపాలుగా పనిచేస్తాయి.

దేశమంతటా సోషలిస్టు పరిణామాన్ని తీసుకొని రావడానికి గణించతగినంతవ్యవధి కాలసివుంటుదన్నది వాస్తవమే. కాని దానికి కావలసిన కొన్నిలక్షణాలు యిప్పటికే వున్నాయి. మనం మార్గాన్ని తెరిచాం. సంసిద్ధతా, పోరాటాలూ యింకా అవసరమే. మనం అభివృద్ధిగావడం మాత్రం నిశ్చయం. కామ్రేడ్ మావో యిలా అన్నాడు: "మనదేశం యిలాగే, యుద్ధం, నూత్నప్రజాతంత్రములద్వారా ప్రయాణం చేసి నిబ్బరంగా పురోగమిస్తుంది. భవిష్యత్తులో, దేశపు ఆర్థిక, సాంస్కృతిక సంపదలు సాధించబడినపుడు, వివిధపరిస్థితులు సిద్ధంగానున్నపుడు, దేశమందలి ప్రజలందరిమధ్యా చర్చలు

జరిగి అంగీకారం కుదిరినపుడు, మనం సకాలంలోనే, చైతన్యం తోనే సోషలిస్టు యుగంలో కాలిడతాము."

కమ్యూనిజం యొక్క యీ మహోన్నతాశయాన్ని ఒక వింతవస్తువు చేయాలని మితవాద అవకాశవాదులు ప్రయత్నిస్తుంటే, దానియొక్క అమూల్యమైన, సజీవ రక్తమాంసాలను తొలిచివేయాలని "అతివాద" అవకాశవాదులు ప్రయత్నించారు. కామ్రేడ్ మావో, చైనావిప్లవం తిరగవలసిన మలుపులన్నింటినీ దృష్టిలోపెట్టుకొని, కమ్యూనిస్టు సిద్ధాంతములలోని దృఢత్వాన్ని, కమ్యూనిజం ఆశయసాధనకోసం అనుసరించే పంథాలోని పట్టువిడుపులతో మేళవింపజేశారు. అందువల్లనే చైనాలో కమ్యూనిజం ఒక వూహామాత్రంగా గాని, అందని ద్రాక్షపండుగా గాని లేదు. అది సుసాధ్యమైన ఆవశ్యకముగాని, సజీవశక్తిగావుంది.

## పార్టీని నిర్మించుటలో వచ్చేసమస్యలు

మార్క్సిజం - లెనినిజమును చైనావిప్లవ నిర్దిష్టపరిస్థితులను, కామ్రేడ్ మావో ఏ క్రమంలో మేళవింపజేశారో అదే క్రమంలో, చైనా కమ్యూనిస్టుపార్టీ కూడా అనుదినముగా బోల్షివిక్ స్వరూపాన్ని సంపాదిస్తూవచ్చింది.

పార్టీయొక్క విధానాలు యెలా నిర్వహింపబడతాయి? ఎలా అవి ప్రజావిధానాలుగా రూపొందుతాయి? మనకున్న అవకాశాలన్నింటినీ ఎలా వుపయోగించుకోవాలి? ఎలా వీటిని వాస్తవంగా రూపొందించాలి? వీటన్నిటికీ కీలకసమస్య పార్టీ సమస్యయే.

లెనిన్ స్టాలిన్‌ల తరహా కమ్యూనిస్టుపార్టీ లేకుండా, చైనా విప్లవ విజయం అసాధ్యమని కామ్రేడ్ మావో స్పష్టం చేశారు. ఆయన యిలా చెప్పారు: "మనం విప్లవాన్ని కొనసాగించాలంటె లెనిన్-స్టాలిన్ తరహా పార్టీ తప్పకుండా వుండాలి. మార్క్సు - ఏంగెల్సు, లెనిన్, స్టాలిన్‌ల విప్లవ సిద్ధాంతమూ తీరులలో నిర్మింపబడిన విప్లవపార్టీ లేనిదే, సామ్రాజ్యవాద తోడేళ్ళను, దాని గుంటనక్క మూకలను నాశనం చేయుటకొరకై కార్మికవర్గాన్నీ, ప్రజాబాహుళ్యాన్నీ నడిపించుట సాధ్యంగాదు. మార్క్సిజం జనించిన తర్వాత గడిచిన యీ వందసంవత్సరాలలోనూ, రష్యాలో బోల్షివిక్ పార్టీ సోషలిస్టు విప్లవాన్ని జరిపించడంలోనూ, సోషలిస్టు సమాజాన్ని నిర్మించడంలోనూ నాయకత్వం వహించి, ఫాసిస్టు దురాక్రమణను ఓడించిన తర్వాతనే, ప్రపంచ వ్యాపితంగా, కొత్తతరహా విప్లవపార్టీలు పుట్టి పెరుగుతున్నాయి. ఇట్టి విప్లవపార్టీలు పుట్టుకతో ప్రపంచ విప్లవ స్వరూపము మారిపోయింది. పెద్దతరములవారికి వూహించ శక్యం గానంత మార్పులు అత్యంత వేగంగా జరిగాయి. సోవియట్ కమ్యూనిస్టుపార్టీయొక్క అనురూపంగానే చైనా కమ్యూనిస్టుపార్టీ స్థాపించబడి పెంపొందింది. చైనా కమ్యూనిస్టుపార్టీ ఏర్పడిన నాటినుండి చైనా విప్లవస్వరూపం పూర్తిగా మారిపోయింది."

మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతంలేనిదే అట్టి విప్లవ పార్టీ మనగలగడం అసాధ్యం. లెనిన్ యిలా అన్నారు: "అభివృద్ధి పొందిన సిద్ధాంతముచే నడుపబడుతున్న పార్టీయే నాయకత్వ పాత్ర వహించగలదు." సోవియట్ బోల్షివిక్‌పార్టీ చరిత్ర సంక్షిప్తపాఠం (Short Course) లో కామ్రేడ్ స్టాలిన్ యిలా

వ్రాశారు: "మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాన్ని పూర్తిగా అవగాహనం చేసుకున్న పార్టీ మాత్రమే కార్మికవర్గాన్ని పురోగమింపచేసి ఆత్మవిశ్వాసంతో నాయకత్వం వహించ గలదు." అనేక చారిత్రాత్మక కర్తవ్యాలను భుజాలపై వేసు కొని, చైనా ప్రజలను విజయవంతంగా నడిపించుటకు శక్తి గలిగి వుండాలంటే, మనపార్టీ, తన సభ్యులలో మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతైక్యతను సాధించాలి; పార్టీ అంతటియొక్క మార్క్సిస్టు-లెనినిస్టు విజ్ఞానాన్ని పెంపొందించాలి. మార్క్సిజం లెనినిజంయొక్క సరియైన నాయకత్వాన్ని దృఢతరం చేసు కోవాలి. కామ్రేడ్ మావో యిలా అన్నారు: "శత్రువును వోడించాలంటే - మన కార్యకర్తలు మంచి స్థితిలో వుండాలి; మన కార్యక్రమాన్ని పూర్తిగా సమన్వయపర్చుకోవాలి. మన శక్తులు మంచి తర్ఫీదుపొందినవిగానూ, మన ఆయుధాలు సునిశితమైనవిగాను వుండాలి." మన కార్యకర్తలు సరైన స్థితిలో వుండడానికీ, మన విధానాలు సమన్వయింపబడి వుండ డానికి పునాది ఏమిటి? మార్క్సిస్టు-లెనినిస్టు ఐక్యతయే ఆ పునాది. మన శక్తులను ఎలా చక్కగా తర్ఫీదు చేసుకో గలం? మన ఆయుధాలు ఎలా నిశితపర్చుకోగలం? పార్టీ అంతటా, మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత విజ్ఞాన స్థాయిని పెంపొందించుట ద్వారానే యిది సాధ్యం. కామ్రేడ్ మావో యిలా చెప్పారు:

"మార్క్సిస్టు - లెనినిస్టు శాస్త్రమును పూర్తిగా ఆకళింపుచేసుకున్నట్లయితే, ప్రజల్లో నమ్మకముంచి, వారికి సన్నిహితంగా వుంటూ వారికి నాయకత్వం వహించినట్లయితే,





మనం ఎంతటి అవాంతరాలైనా దాటగలం. ఎంతటి కష్టాల నుండైనా గట్టెక్కగలం. మనబలం అజేయంగా వుంటుంది."

అందువల్ల కామ్రేడ్ మావో వివిధ తప్పుడు సిద్ధాంతాలకు వ్యతిరేకంగా పోరాటం సాగించి, మనపార్టీని నిర్మించి సిద్ధాంతరీత్యా దృఢతర మొనర్చాడు.

కామ్రేడ్ మావో, మార్క్సిజం - లెనినిజంపట్ల వుండే వైఖరిని, పార్టీ తత్వముతో స్పష్టంగా జోడించాడు. ఈ రెండింటికీ అవినాభావసంబంధముందని చెప్పాడు.

"ఒక శాస్త్రీయమైన వైఖరిలేకుండా, లేక అసంపూర్ణ శాస్త్రీయవైఖరిలోగాని, యింకో మాటల్లో చెప్పాలంటే, సిద్ధాంత, ఆచరణలమధ్య ఐక్యతపట్ల మార్క్సిస్టు దృక్పథము పూర్తిగాలేకపోవడమో, లేక అసంపూర్ణంగా వుండుటయో, జరుగుతున్నదంటే, పార్టీతత్వము లోపించిందనిగాని, లోటు వుందనిగాని భావించవలసి వుంటుంది." అని మావో చెప్పారు.

పార్టీలో పిడివాదము, కేవల లోకానుభవ వాదం, అనే రెండు సిద్ధాంతపొరబాట్లు తలెత్తాయి. వీటిని అత్యంత శక్తివంతంగా ఎదిరించాలని కామ్రేడ్ మావో చెప్పారు. "పిడివాదము, కేవలలోకానుభవవాదములు రెండు ధృవాల నుండి బయలుదేరుతున్నప్పటికీ స్వకీయాత్మక విధానముయొక్క రెండు ముఖాలే"నని కామ్రేడ్ మావో స్పష్టపర్చారు. రెండు ధృవాలనుండి బయలుదేరిన యీ రెండుసిద్ధాంతాలు, పాక్షిక దృష్టితోనున్నవే. ఏడుగురు గుడ్డివాళ్ళు ఏనుగచందమే ఈ రెండు ధోరణులలక్షణం. అందువల్ల ఒకసందర్భంలో వుత్పన్నముగు ఆచరణకు సంబంధించిన సమస్యవచ్చినపుడు మాత్రం యివి రెండూ ఒకేవైఖరి ననుసరిస్తాయి.

పార్టీలో తలెత్తిన "అతివాద" మితవాద అవకాశవాదము లన్నింటియొక్క సిద్ధాంతపునాది యీ స్వకీయాత్మక సిద్ధాంతమే, ఇవి రెండూ మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతమునుండి ప్రక్కదోవలు పట్టాయి. అందువల్ల సరియైన సిద్ధాంతము, తప్పుడుసిద్ధాంతములమధ్య పోరాటం, పార్టీ అంతరంగిక పోరాటంలో ప్రధాన సమస్యగా యావొందింది. కాబట్టి యీ ప్రధాన సిద్ధాంత విషయముపైననే అవకాశవాదమును ఓడించి వివిధ రూపాల్లోనున్న అవకాశవాదమును రూపుమాపాలని కామ్రేడ్ మావో స్పష్టపర్చారు.

సక్వీయాత్మక విధానంయొక్క యీరెండురూపాలకూ పెటీబూర్జువా వర్గమే సాంఘిక పునాది. మనపార్టీ సభ్యులలో గణించ తగినంతమంది పెటీబూర్జువా వర్గమునుండి వచ్చిన వారున్నందువల్ల నే యీ రెండు అభివృద్దినిరోధక తప్పుడు సిద్ధాంతాలు, తీవ్రంగావున్నాయి. "చైనాలో, పెటీబూర్జువా వర్గం పెద్దవర్గంగా నున్నది. ఈవర్గం మన పార్టీచుట్టూ వున్నది. యీ వర్గంనుండి మన పార్టీలోకి చాలామంది వచ్చారు. వారు పార్టీలో జేరునపుడు, కొద్దిగానో గొప్పగానో తమ వర్గ లక్షణాలతోనే వస్తారు" అని కామ్రేడ్ మావో చెప్పారు. అందువల్ల నే యీ రెండు స్వకీయాత్మక సిద్ధాంతాలకూ వ్యతిరేకంగా చాలాకాలం క్రితమే తాను ప్రారంభించిన పోరాటాన్ని కామ్రేడ్ మావో ఎన్నడూ సడలించలేదు. 1926 లో కామ్రేడ్ మావో యిలా చెప్పారు: "(1) రాజకీయ పరిస్థితిని పరిశీలించుటలోనూ, వర్గశక్తులను అంచనా వేయుటలోనూ, స్వకీయాత్మక పరిశీలన, అంచనాలకు బదులు మార్క్సిస్టు - లెనినిస్టు విధానాన్ని అనువర్తింపచేయునట్లు పార్టీ సభ్యులను

తక్షీను చేయాలి. (2) సాంఘికార్థిక పరిశోధన అధ్యయనములు చేయునట్లున్నూ, తద్వారా, పోరాట ఎత్తుగడలు, పనితీరు నిర్ణయించుకొనునట్లు పార్టీ సభ్యుల దృష్టి మరల్చాలని వాస్తవ పరిస్థితులను పరిశోధించక పోయినట్లయితే వ్యూహ కల్పనా, దుందుడుకుతత్వం అనే అగాధంలోకి పోయే ప్రమాదం వున్నదని కా|| మేడ్సును అర్థమగునట్లు చేయాలి." తన దీర్ఘకాలానుభవాన్ని దృష్టిలో వుంచుకొని కా|| మేడ్ మావో 1936 లో 'ఆచరణ' 'వైరుధ్యాలను గురించి' అనబడు రెండు ప్రముఖ సిద్ధాంత గ్రంథాలను వ్రాశారు. ఇవిరెండూ, యీ రెండు విధాల స్వకీయాత్మక విధానానికి వ్యతిరేకంగా వుద్దేశించబడినవే. తరువాత, యీ రెండు స్వకీయాత్మక సిద్ధాంతాలకు వ్యతిరేకంగా, పార్టీలో కా|| మేడ్ మావో సరిదిద్దుకునే (Rectifiction) వుద్యమాన్ని ప్రారంభించారు. ఇది మన పార్టీ చరిత్రలో అత్యంత చారిత్రక ప్రాముఖ్యతగల వుద్యమం.

రెండు ధృవములనుండి ప్రారంభమైనా ఒకే స్వభావం గల పిడివాదం, కేవల లోనుకానుభవం అనబడు రెండు సబకిజట్టి విస్టు సిద్ధాంతాలను బట్టబయలుచేయుటద్వారా కా|| మేడ్ మావో పార్టీ నిర్మాణమునకు అత్యంత ముఖ్యమైన సేవ చేశారు. యీ రెండు స్వకీయాత్మక సిద్ధాంతాలను అధిగమించు సరైన వ్యాఖ్యాన మిచ్చారు.

"ఈ స్వకీయాత్మక సిద్ధాంతాలను వ్యతిరేకించుటలో మనం రెండు విషయాలు గమనించాలి. ఈ యిద్దరిలో ఎవరికి దేనిలో లోటువుంటే దాన్ని పూర్తిచేసుకునేలా చూడాలి. రెండవవారిలోనున్న బలమైన సుగుణాలను స్వీకరించి తను అలవర్చుకునేలా చేయాలి. పుస్తక జ్ఞానంగలవారు వాస్తవ

ప్రపంచాన్ని అధ్యయనం చేయాలి. తద్వారా అభివృద్ధి గావాలి. లేకపోతేవారు పుస్తకాల్లోనే మునిగిపోయి పిడివాద పొరపాట్లు చేస్తారు. పనిచేయుటలో అనుభవం గడించినవారు సిద్ధాంత అధ్యయనం ప్రారంభించాలి. తద్వారా తమ అనుభవాన్ని పరిశీలించుకొని, క్రమబద్ధంచేసుకొని దానిని సిద్ధాంత స్థాయికి తీసికొనిపోవాలి. లేకపోతే తమ పాక్షికానుభవమే సర్వస్వమనుకొని, కేవల లోకానుభవవాద తప్పిదాన్ని చేస్తారు" అని కామ్రేడ్ మావో విశదీకరించారు.

కామ్రేడ్ మావో చూపిన బాటను పయనించడమంటే సిద్ధాంత, ఆచరణలమధ్య ఐక్యత సాధించుటయే. కామ్రేడ్ మావో తన అభిప్రాయాలను విశదీకరించునప్పుడు తరుచుగా కామ్రేడ్ స్టాలిన్‌యొక్క ప్రసిద్ధ వాక్యాలను చెపుతూ వుంటారు: "విప్లవ ఆచరణతో సంబంధంలేని సిద్ధాంతం లక్ష్య రహితమౌతుంది - అలాగే విప్లవ సిద్ధాంతపు వెలుగులేనిదే ఆచరణ చీకట్లో తడుములాడుతుంది" పిడివాదం మొదటి తరగతికిచెందినదైతే, కేవల లోకానుభవవాదం రెండో తరగతికి చెందినది. అందువల్ల యీ రెండు పొరబాట్లను సరిదిద్దుట అంటే, సిద్ధాంత, ఆచరణలమధ్య ఐక్యత సాధించుటయే.

మార్క్స్, ఏంగెల్సు, లెనిన్, స్టాలిన్‌ల సిద్ధాంత అధ్యయనమును, ప్రజల అనుభవ నిరంతర అధ్యయనముతో మేళవింపచేయాలి. దీనినే కామ్రేడ్ మావో "మార్క్సిస్టు - లెనినిస్టు తత్వశాస్త్రమును, చైనా విప్లవ నిర్దిష్ట ఆచరణతో మేళవింపజేయుట" అని పిలిచారు,

కామ్రేడ్ మావో యిలా అన్నారు:

"మన పార్టీయొక్క అనుదిన కార్యక్రమంలో, ప్రజల నుండియే నిజమైన నాయకత్వం వస్తుంది. తిరిగి వారికే చేరు కుటుంది. చెల్లాచెదురైయున్న, క్రమంగాలేని ప్రజల భావ పరంపరను ఒకలాచేర్చి, అధ్యయనంచేసి వాటిని సక్రమమైన భావాలుగా రూపొందించాలి. తరువాత మనం వీటిని ప్రజల్లో ప్రచారంచేసి, వివరించి, వాటిని ప్రజల స్వాభిప్రాయాలుగా మార్చాలి. ప్రజలు వీటికొరకై నిలబడేలాచేస్తూ, అట్టి ప్రజా చర్యలద్వారా ఈ అభిప్రాయాల బాగోగులను పరీక్షించు కుంటూ వుండాలి. ఆతర్వాత పుగ్ళవించిన ప్రజాభిప్రాయాలను తిరిగి పోగుచేసి వాటికి సక్రమమైన స్వరూపం యిచ్చి వాటిని ప్రజలపరంచేసి వాటికొరకై ప్రజలు నిలబడునట్లు చేయాలి. ఇది ఒక అనంతమైన చక్రం. దీనిద్వారా మరింత విస్పష్టత, గాంభీర్యతా లభిస్తుంది. ఇదే మార్క్సిస్టు-లెనినిస్టు విజ్ఞాన సంపాదనావిధానం, పని విధానం."

అయితే దీనిని నిరంతరం సాగించడమెట్లు? మార్క్సిస్టు లెనినిస్టు మార్గదర్శక సూత్రములకు కట్టుబడియుండుట ద్వారానే యిది సాధ్యం. 'కేవల లోకానుభవవాదులు' మార్క్సిస్టు - లెనినిస్టు మార్గదర్శక సూత్రాలను విడనాడి, చెల్లాచెదురై, ఒకదానికొకటి సంబంధములేని యీ స్థితిలోనే సతమతమౌతుంటారు. పిడివాదులు, ప్రజల అభిప్రాయాలనూ, స్వానుభవాలను విసర్జించినందువల్ల, ప్రజల అభిప్రాయా లను నిర్దిష్టమొనర్చి క్రమబద్ధమొనర్చుటపై పరిశోధన సాగిం చుట చేతగాకున్నారు. అందువల్ల వారి నాయకత్వం తప్పులే చేస్తుంటుంది. వారి నాయకత్వాన జరిగేపని విఫలమౌతుంది.

మన పార్టీయొక్క 30 సంవత్సరాల చరిత్ర, సరియైన మార్క్సిస్టు - లెనినిస్టు నాయకత్వానికీ, లోపభూయిష్టమైన, మార్క్సిస్టు వ్యతిరేక నాయకత్వానికీ మధ్య జరిగిన పోరాట చరిత్రయే; కామ్రేడ్ మావో యొక్క సరియైన నాయకత్వం లోపభూయిష్టమైన నాయకత్వమును ఓటమి తినిపించిన చరిత్రయే; తర్వాత విప్లవంలో కలిగిన యిబ్బందులను, ఆటంకాలను, అధిగమించి, విప్లవ అంతిమవిజయానికి తీసికొనిపోయిన చరిత్రయే.

ఈ నాయకత్వము, స్వకీయాత్మక సిద్ధాంతమును సిద్ధాంతరీత్యానూ, అవకాశవాదములను రాజకీయంగానూ, వ్యతిరేకించి జరిపిన పోరాటము. నిర్మాణరంగము రంగంలో ఒంటెత్తుతనానికి వ్యతిరేకంగా జరిపిన పోరాటమునకు జోడించబడింది.

పెటీబూర్జువా సంకుచిత మనస్తత్వము, సిద్ధాంతరంగములో పాక్షికవైఖరికి లోనగుటయేగాక, రాజకీయ జీవితంలోనూ, నిర్మాణంలోనూ, ఒంటెత్తుతనపు స్వరూపం తీసుకుంటుంది. స్వకీయాత్మక విధానంవల్ల పార్టీలోపలా, బయటా ప్రజలనుండి సిద్ధాంతరీత్యా వేరగుట సంభవిస్తుంది. ఒంటెత్తు విధానంవల్ల పార్టీలోపలా, బయటా నున్న ప్రజలనుండి రాజకీయంగా నిర్మాణరీత్యా వేరగుట జరుగుతుంది. ఇవి రెండూ ఒకే వస్తువుయొక్క రెండు రూపాలు. ఇట్టి ఒంటెత్తుతనం ఒకప్పుడు దీర్ఘకాలం వెంటాడి దుష్ఫలితాలను కలుగవేసింది.

1929 లో కామ్రేడ్ మావో ముఠాతత్వాన్ని తీవ్రంగా విమర్శించాడు. "ఇది మూల్గులను తినివేసే విచ్ఛిన్నకర స్వభా

వము గలది" అని వివరించాడు. ముఠాతత్వం వ స్తువానికి ఒంటెత్తుతనమే. 1942 లో కామ్రేడ్ మావో ఇలా అన్నారు:

"20 సంవత్సరాలుగా పార్టీని రాటుతేల్చిన వెనుక యిప్పుడు మనపార్టీ ఒంటెత్తుపోకడల ప్రభావానికి లోను గావడం లేదు. కాని, పార్టీయొక్క బహిర్గత అంతర్గత సంబంధాలలో యింకా ఒంటెత్తుపోకడ యొక్క అవశేషాలున్నాయి. పార్టీ అంతర్గత సంబంధాలలో ఒంటెత్తుతనంవల్ల మనమధ్య సద్భావాలు లేకపోవడం, పార్టీయొక్క ఐక్యత పటిత దెబ్బ తినడం జరుగుతుంది. బహిర్గత సంబంధాలలో ఒంటెత్తుతనం వల్ల పార్టీయేతర ప్రజలనుండి మనం వేరైపోవుటా, దేశంలోని ప్రజాబాహుళ్యాన్ని ఐక్యపర్చుకర్తవ్యాన్ని నెరవేర్చకుండా అడ్డగించుట జరుగుతాయి. ఈ రెండు దుష్టశక్తులను రూపుమాపుటద్వారానే, పార్టీసభ్యులందరిమధ్యా, దేశంలోని ప్రజాబాహుళ్య మంతటిలోనూ, ఐక్యతసాధించాలనే మన మహత్తర కర్తవ్యాలను నిరాటంకంగా నిర్వహించగలం."

కామ్రేడ్ మావో ఒంటెత్తుతనంపై పోరాటం సాగించుటద్వారా, పార్టీలోని యావన్మందినీ సమీకరించి, పార్టీకి ప్రజలకు మధ్య సరైనసంబంధాలు అభివృద్ధిచేయుటద్వారా పార్టీనిర్మాణానికి ఎంతో సేవచేశాడు. మనం సిద్ధాంతరీత్యాను రాజకీయంగాను, సరైనస్థితిలో నున్నపుడే పార్టీ అంతర్గత సంబంధాలలోనూ, ప్రజలతో పెట్టుకునే సంబంధాలు సరైనస్థితిలో నున్నపుడే మనవిజయం తథ్యం.

మనపార్టీలో స్వకీయాత్మక విధానము, ఒంటెత్తు తత్వములనుండి ఎలా బయటపడగలం? అనేక చారిత్రక పరిస్థితుల

వల్ల మనపార్టీలో పెటీబూర్జువా వర్గమునుండి వచ్చినవారు అనేకులున్నారు. వారిలోనున్న వివిధపొరబాట్లనూ సరిదిద్దుకొని, పార్టీలో ఐక్యత దృఢపర్చుకోవాలన్నట్లయితే, మనం ఖచ్చితమైన విచక్షణాయుతమైన విధానాన్ని అనుసరించాలి. అంతే గాని వుదాసీన వైఖరిని, తొందరపాటుతనాన్ని గాని ప్రదర్శించరాదు.

మనపార్టీయొక్క ఆంతరంగిక పోరాటమునకు తగురీతిలోనే సరిదిద్దుకునే వుద్యమం, అధ్యయనోద్యమాన్ని పార్టీలో ప్రవేశపెట్టి కామ్రేడ్ మావో పార్టీకి ఎనలేని సేవచేశారు. పార్టీయొక్క సమైక్య నాయకత్వాన, పార్టీకార్యకర్తలలోనూ పార్టీసభ్యులందరిలోనూ, పార్టీ ఆంతరంగిక చరిత్రకు సంబంధించిన సమస్యలపైన పార్టీలో పొరబాట్లను గురించి తగినంత అధ్యయనం చర్చలు కొనసాగించాలి. వారికి పార్టీద్వారా మార్క్సిస్టు - లెనినిస్టు సాహిత్యాన్ని, పార్టీసాహిత్యాన్ని అందించాలి. సిద్ధాంత రాజకీయ చైతన్యపుబాటవెంట వారిని తీసుకొనిపోయి పార్టీసహాయంతో చైతన్యయుతంగా "నిజానికి కట్టుబడియుండి తప్పులను సరిదిద్దుకొను"నట్లు చేయుటకై విమర్శ ఆత్మవిమర్శనా విధానమును అనులుపర్చుటయే యీ వుద్యమపు స్వభావం. కామ్రేడ్ మావో, యీ వుద్యమలక్ష్యాలను యిలా వివరించారు:

1. "గతంనుండి నేర్చుకొని భవిష్యత్తులో జాగ్రత్తగానుండుట.

2. రోగియొక్క జబ్బును నయంచేయడానికే చికిత్స చేయాలి.

గతంలోని తప్పులను పొరబాట్లను నిర్దాక్షిణ్యంగా విమ ర్శించుకోవాలి. వాటిని శాస్త్రీయంగా పరిశీలించాలి. తద్వారా భవిష్యత్కార్యక్రమంలో అత్యంత జాగరూకులమై వర్తించి పనిలో నైపుణిని వృద్ధిచేసుకొనుట దీనిలో వుద్దేశం. ప్రథమ సూత్రముయొక్క అర్థమిదే. రోగికి చికిత్స చేయుటలో డాక్టరుకు ఎలాంటి వుద్దేశముంటుందో అలాగే, తప్పులను, పొరబాట్లను విమర్శించుకొనుటలో మనకుకూడా అదే వుద్దేశంవుంది. రోగిని చంపాలనిగాక రోగాన్ని కుదర్చాలని డాక్టరువుద్దేశం. తీవ్రమైన ఉదరకోశవ్యాధితో బాధపడుతున్న వ్యక్తికి, శస్త్రచికిత్స చేస్తే తిరిగి కోలుకుంటాడు. తప్పులు ఎంతతీవ్రమైన వైనప్పటికీ యిబ్బంది లేదు. చేసిన ఏవ్యక్తి అయినా తిరిగి మంచిస్థితిలోనికి వచ్చి, మంచి కామ్రేడ్‌గా తయారయ్యేవరకూ చికిత్స పొంద వచ్చు. మందు తీసుకోవలసి వస్తుందని రోగాన్ని కప్పిపెట్టుకొన రాదు. తప్పులు చేసిచేసి చివరికి శతమొండిగా తయారు గాకుండా రోగాన్ని నయంచేసుకొని తిరిగి ఆరోగ్యాన్ని పొందా లని మనస్ఫూర్తిగా ఆశించినవారు, తప్పకుండా తిరిగి బాగు పడతారు." కామ్రేడ్ మావో యీ క్రిందివిషయాన్ని పదేపదే చెపుతుండేవారు. "సిద్ధాంతాన్ని విశదీకరించుట, కామ్రేడ్స్‌ను ఐక్యపర్చుట అనే ద్విముఖ కర్తవ్యములు దీనిలక్ష్యం" పార్టీ లోని తప్పుడు సిద్ధాంతాలతో పోరాటం జరుపునపుడు, వుదార వైఖరి పనికిరాదు. ఖచ్చితమైన వైఖరినే అవలంబించాలి. కఠినమైన వైఖరికి బదులు, వివేకవంతమైన వైఖరి నవలం భించాలి. వుద్యమం మనపార్టీకి యింకెంతో లాభదాయక మైనదనీ, చాలా జయప్రదంగా అమలుజరిగిందనీ మనపార్టీ

చరిత్రయే 1942 లో సరిదిద్దుకునే వుద్యమం ప్రారంభించబడిన తర్వాత జరిగిన మన పార్టీ జీవితమే ధృవపరుస్తున్నాయి.

సరిదిద్దుకునే వుద్యమంవల్ల మనపార్టీయొక్క స్వరూపం చాలా తీవ్రమైన బ్రహ్మాండమైన మార్పులను చెందింది. (1) దీనిద్వారా యావత్తు పార్టీయొక్క మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతస్థాయి చాలా పెంపొందింది. (2) మనపార్టీసభ్యులు కనీవిని ఎరుగనంత సమైక్యంగా, కేంద్రకమిటీ, కామ్రేడ్ మావో వెనుక సమీకృతులైనారు. కామ్రేడ్ మావో యొక్క రాజకీయపంథా అన్నివిధాలా అమలుజరిగిందనీ, ఒక శత్రువువెంట వేరొకశత్రువును ఓడించుటకు శక్తిని చేకూర్చిందనీ యీరెండు హంశాలు వుపయోగించాయి.

1945 ఏప్రిల్‌లో పార్టీ 7 వ కాంగ్రెస్ జరిగింది. ఈ కాంగ్రెసు యావత్తు పార్టీని ఐక్యపర్చింది; జపాన్ వ్యతిరేక ప్రతిఘటనా యుద్ధకాలంలో కామ్రేడ్ మావోయొక్క విధానాన్ని అనుసరించుటద్వారా పార్టీ సాధించిన విజయాలను సమీక్షించి, దేశంలోని ప్రజలందరి విజయానికీ పునాదివేసింది. ఈ కాంగ్రెస్‌లో కామ్రేడ్ మావో రాజకీయ నివేదిక ప్రవేశపెట్టారు. విప్లవంయొక్క దేశవ్యాప్త విజయమునకై యావత్తు పార్టీనీ, ప్రజానీకాన్నీ సమీకరించు కార్యక్రమాన్నీ, విధానాన్నీ నిర్ణయించింది. గత ఆరుసంవత్సరాల కాలక్రమమే కాంగ్రెస్ రూపొందించిన రాజకీయ విధానం పూర్తిగా సరైనదని నిరూపించింది. మహావిప్లవం దేశవ్యాప్త విజయాన్ని సాధించుటయే దీనికి తిరుగులేని నిదర్శనం. సిద్ధాంతరంగంలో సరిదిద్దుకునే వుద్యమము యీ కాంగ్రెస్‌కు ప్రాతిపదిక. ఈ కాంగ్రెస్ పర్యవసానంగా పార్టీ కార్యకర్తలంతా రాటుదేలారు

అందువల్లనే, యీ కాంగ్రెస్ వారికిచ్చిన చారిత్రిక కర్తవ్యాన్ని విజయవంతంగా నెరవేర్చారు.

సిద్ధాంత రంగంలో, సరిదిద్దుకునే వుద్యమ ఫలితంగా, పార్టీ పదజాలముగా రూపొందిన స్వకీయాత్మ విధానం ఒంటెత్తు తనములు మాత్రమే నష్టపడ్డాయి. సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా, ప్రజల మహావిప్లవ విజయసాధనకు కావలసిన సిద్ధాంత సన్నద్ధతనూ, రాజకీయ నాయకత్వాన్ని పార్టీ సమకూర్చింది. ఇది ఆ వుద్యమం సాధించిన విజయం.

మనపార్టీ కామ్రేడ్ మావో నాయకత్వాన, ఎంతటి చరిత్రాత్మక కర్తవ్యాలనైనా నెరవేర్చుటకు శక్తిగల్గినమార్క్సిస్టు-లెనినిస్టు విప్లవపార్టీగా రూపొందింది.

మనపార్టీ కామ్రేడ్ మావో నాయకత్వాన, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ అడుగుజాడల ననుసరించి, బోల్షివిక్ స్వభావాన్ని పొందిన విప్లవపార్టీగా రూపొందింది.

తత్కారణంగానే, మనం నిరంతరం అభివృద్ధిగావడం, భవిష్యత్కర్తవ్యాలలో విజయం సాధించడంమాత్రం తథ్యమని నిరూపించబడ్డాయి.

## ముగింపు

చైనా ప్రజావిప్లవ విజయం, 50 కోట్ల జనాభా గల్గిన విశాలమైన దేశంలో మార్క్సిజం-లెనినిజంయొక్క విజయం. అక్టోబరు మహావిప్లవానంతరం జరిగిన మరొక మహావిప్లవమది. అక్టోబరు సోషలిస్టువిప్లవానంతరం, సామ్రాజ్యవాదంచే పీడింపబడుతున్న దేశంలో జరిగిన మరొక తరహా మహావిప్లవం.

చైనాలో జరిగిన యీ తరహా విప్లవపు సిద్ధాంత, రాజకీయ శిల్పఖండాలే కామ్రేడ్ మావో రచనలు. ఈ విప్లవంలో మార్క్సిజం - లెనినిజం చూపించిన అత్యంత సజీవశక్తియొక్క ప్రతిబింబాలే కామ్రేడ్ మావో రచనలు.

కామ్రేడ్ లెనిన్ యిలా వ్రాశారు :

"సర్వసంపూర్ణమైనదిగా, అతిక్రమించరానిదిగా మార్క్సిజాన్ని మేము ఎంచము. అది ఒక శాస్త్రీయ విజ్ఞానానికి పునాదులు వేసింది. తాము కాలచక్రంలో వెనుకబడిపోకుండా వుండాలంటే, సోషలిస్టులు దానిని సర్వతోముఖంగా అభివృద్ధి చేయాలి. ఈ మార్క్సిజం కీలకమైన సూత్రాలను రూపొందించింది. అవి ఇంగ్లండుకు ఒక విధంగానూ, ఫ్రాన్సుకు మరొక విధంగానూ, జర్మనీకి ఒక రకంగానూ, రష్యాకు వేరొక రకంగానూ అన్వయించవలసి వుంటుంది. అందువల్ల, మార్క్సిజాన్ని స్వతంత్రంగా విపులీకరించడం (elaboration) రష్యన్ సోషలిస్టులకు అవసరం."

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర ముగింపులో యిలా స్పష్టం చేయబడింది :

"మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతంయొక్క శక్తి యీ క్రింది విషయాల్లో యిమిడివుంది. ఎట్టిపరిస్థితులలోనైనా సరియైన పరిష్కారమార్గాన్ని కనుగొనేందుకు సిద్ధాంతం పార్టీకి సహాయ పడుతుంది. వర్తమాన ఘటనలలోని ఆంతరంగిక సంబంధాలను అర్థంచేసుకోడానికి సహాయపడుతుంది. ఈ ఘటనల క్రమాన్ని ముందు చూడగలుటయేగాక, ప్రస్తుతం అవి ఏ మార్గాన ఎలా అభివృద్ధిచెందుతున్నాయో గ్రహించుటయే గాక, భవిష్యత్తులో అవి ఏ మార్గాన ఎలా అభివృద్ధిచెంది

తీరుతాయో, దానినికూడా గ్రహించడానికి ఆ సిద్ధాంతం తోడ్పడుతుంది."

ఆ బృహద్గ్రంథంలోనే యింకా యిలా వుంది:

"మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా అర్థంచేసుకోవడమంటే అర్థం విప్లవోద్యమపు నూతనానుభవంతోనూ, నూత్న సూత్రాలతోనూ, సారాంశాలతోనూ ఆ సిద్ధాంతాన్ని మరింత పెంపొందించగలుగుటయే. సిద్ధాంత సారాంశము ననుసరించి ఎట్టి జంకు గొంకూ లేకుండా, బూజు పట్టిన పాతసూత్రాలస్థానే నూతన చారిత్రక పరిస్థితి కనుగుణమైన సూత్రాలను, సారాంశాలను నెలకొల్పి, ఆ సిద్ధాంతాన్ని అభివృద్ధిచేసి పురోగమింపజేయుటయే."

లెనిన్ - స్టాలిన్‌ల యీ భావాల కనుగుణ్యంగానే కామ్రేడ్ మావో మార్క్సిజాన్ని వర్తింపచేస్తున్నారు. ప్రాచ్య దేశాలలోని పరిస్థితులు, యూరోపియన్ పెట్టుబడిదారీ దేశాల లోని పరిస్థితులకు ఎంతో వ్యత్యాసంవున్నది. అందువల్ల, మార్క్సిజం - లెనినిజం యొక్క సాధారణ సూత్రాలను ప్రాచ్యదేశాల కన్వయింపజేయవలెనన్నచో కామ్రేడ్ మావోకు ఎంతో సిద్ధాంతపటిమ, సృజనాత్మకశక్తి వుండాలి. ఈ వ్యత్యాస[illegible] కామ్రేడ్ మావో ప్రతికూలత నెదుర్కో[illegible]
[illegible]ది. ఈ వ్యత్యాసకారణంగానే కామ్రేడ్ మావో
[illegible]ద్ధాంతం విజయాన్ని సాధించింది.
[illegible]మసీమల్లో దీర్ఘకాల యుద్ధాన్ని కొనసాగించుట,
[illegible] పట్టణాలను చుట్టుముట్టుట, ఆతర్వాత పట్టణాలను
[illegible]చ్చుకొనుట, అక్కడ కూడా వున్న చిన్నచిన్న స్థావ
[illegible]ాధికారాన్ని నెలకొల్పి, నిలద్రొక్కుకొనుట,

దేశమంతటా అధికారాన్ని స్వాధీనం చేసుకునేంతవరకు, దీర్ఘకాల పోరాటాలద్వారా, యీ స్థావరాలను బలీయమొనర్చి, విస్తరింపజేయుట, మన విప్లవక్రమంగా వుంటుందని కామ్రేడ్ మావో 20 సంవత్సరాలక్రితం చెప్పాడు. చైనా విప్లవాన్ని అధ్యయనం చేయుటలో మార్క్సిజం - లెనినిజం అన్వయింపజేయుటవల్లనే యిలా నిర్ధారణగా చెప్పగలిగారు. వలస, అర్ధవలసదేశాలకు వుపయోగించు నూత్న మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలవి. ఈ సూత్రీకరణలు సరియైనవని చైనా విప్లవం రుజువుచేసింది. ఆగ్నేయాశియా దేశాలలోని విప్లవ కార్యకలాపాలు వాటిని బలపరుస్తున్నాయి. మార్క్సిజం - లెనినిజం యొక్క, గతితార్కికవాదం యొక్క తిరుగులేని శక్తినే యివి నిరూపిస్తున్నాయి.

1949 లో జరిగిన ఆశియా, ఓషనిక్ దేశాల ట్రేడ్ యూనియన్ మహాసభను ప్రారంభిస్తూ కామ్రేడ్ లీ-షో-ఛీ యిలా చెప్పారు: "సామ్రాజ్యవాదాన్ని' దానితొత్తులనూ ఓడించుటలోనూ, చైనా ప్రజారిపబ్లిక్‌ను నెలకొల్పుటలోనూ అవలంభించిన మార్గమునే, వివిధ వలస, అర్ధవలసదేశాల ప్రజలు జాతీయ స్వతంత్రంకొరకు, ప్రజాతంత్ర ప్రజాస్వామ్యంకొరకు జరుపు పోరాటంలో అవలంభించవలసి వుంటుంది.

"కామ్రేడ్ మావో సూచించిన మార్గమి

మార్క్సిజం - లెనినిజం ప్రాచ్యదేశాలలో
అభివృద్ధియే కామ్రేడ్ మావో యొక్క సిద్ధాంతమ
దేశాల విప్లవానుభవపు యీ శిల్పఖండములు మా
లెనినిజములకు అత్యంత ప్రాముఖ్యమైనవి. యా
పోరాటానికే యివి ప్రాముఖ్యమైనవి.





★



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPCAT08B148 |
| పుస్తకం పేరు | జైన విజ్ఞానం - మొదలగు |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | IV |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |